

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# శ్రీనమ్మాళ్వారులు— వారి దివ్యప్రబంధాలు




శ్రీనమ్మాళ్వారులు, శ్రీరంగం

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీనమ్మాళ్వారులు– వారి దివ్యప్రబంధాలు

(డాక్టర్ ఈ. ఏ. శింగరాచార్యులు, నరసాపురం)

★★★

**యో వేదాన్ ద్రమిడోక్తిభిః జితసుధాధారాభి రన్వగ్రహీత్**
**యః శ్రుత్యుక్తివిరుద్ధవాదిగజహర్యక్ష స్సమింధేతరామ్,**
**యః కూటస్థతయా ప్రపన్నజనతాయాః కీర్త్యతే చోత్తమైః,**
**తస్య శ్రీశఠవైరిణః సుచరితం వక్ష్యే చ వాగ్వైభవమ్.**

**"వృషభే తు విశాఖాయాం కురికాపురి కారిజమ్,**
**పాండ్యదేశే కలే రాథౌ శఠారిం సైన్యపం భజే"**

(కలియుగం ఆరంభంలో, వైశాఖమాసంలో, విశాఖా నక్షత్రంలో, పాండ్యదేశంలో ఉండే తిరుక్కురుగూర్ అనే దివ్యదేశంలో, కారి అనే మహనీయులకు కుమారులై, విష్వక్సేనులు అనబడే దివ్యసూరుల అంశతో అవతరించిన శఠకోపులను ఉపాసిస్తున్నాను)

**"సేనేశగురుణా లబ్ధదివ్యమంత్రాన్వయం ముదా,**
**ద్రావిడామ్నాయవక్తారం శఠకోపగురుం భజే"**

(విష్వక్సేనులు అనే ఆచార్యుల వల్ల దివ్యమైన మంత్రాలలో అన్వయాన్ని కలిగినవారు, ద్రావిడ వేదాలను అనుగ్రహించినవారు అయిన శఠకోపులు అనే గురువును ఆనందంగా భజిస్తున్నాను)

**"ఉండో వైకాశి విశాగత్తుక్కు ఒప్పొరు నాళ్?**
**ఉండో శడగోపర్ క్కు ఒప్పొరువర్? – ఉండో**
**తిరువాయ్ మొ<u>ళి</u>క్కు తెన్ కురుగైక్కు ఉండో**
**ఒరు పార్ తన్నిల్ ఒక్కు మూర్? " (ఉపదేశ రత్తినమాలై)**

(వైశాఖమాసం విశాఖా నక్షత్రానికి సమానమైన నక్షత్రం ఇంకొకటి ఉన్నదా ? శఠకోపులు అనబడే నమ్మాళ్వార్లతో సమానమైనవారు ఇంకొకరు ఉన్నారా? తిరువాయ్ మొళి దివ్యప్రబంధంతో, తిరుక్కురుగూర్ దివ్యక్షేత్రంతో సమానమైన దివ్యప్రబంధం, దివ్యక్షేత్రం అనేది ఈ భూమిలో వేరొకటి ఏదైనా ఉన్నదా ? లేదు కదా.)

★★★

దివ్యసూరులు అనబడే ఆళ్వారులు 12 మంది. **"ఆ<u>ళ్</u>వార్"** అనే ద్రావిడ పదం తెలుగులో ఆళ్వార్ అని వ్యవహరింపబడుతున్నది. ఈ పదానికి, **"భగవంతుడు అనే అమృత సముద్రంలో ఎల్లప్పుడూ లోతుగా అవగాహవిస్తూ, ఆనందాన్ని అనుభవిస్తూ ఉండేవారు"** అని అర్థం. వీరు లోకానికి అందించిన ద్రావిడ భాషలోని సాహిత్యానికి దివ్యప్రబంధాలు అని, ద్రావిడ వేదం అని, నాలాయిరం అని పేరు. ఆళ్వారులు, తాము అనుభవించిన దివ్యమైన

భగవంతుని మధురమైన అనుభూతిని తమ ప్రబంధాలలో వెలువరించినందు వల్ల, వీరు రచించిన ప్రబంధాలకు దివ్యప్రబంధాలు అనే పేరు వచ్చింది. ఆ విధంగానే, ఈ ప్రబంధాలు అన్ని సంస్కృత వేదాలలో ప్రకాశించే దార్శనిక తత్త్వాలను ప్రతిపాదిస్తున్నందువల్ల ఈ ప్రబంధాలకు ద్రావిడ వేదం అనే పేరు ఏర్పడింది. ఈ ప్రబంధాలలో ఇంచుమించుగా నాలుగు వేల పాశురాలు ఉన్నందువల్ల నాలాయిరం అనే పేరు ప్రసిద్ధమైనది.

అళ్వార్లు అందరూ భగవదంశ సంభూతులని నిత్యసూరుల అంశతో అవతరించినవారని ఒకవిధమైన అభిప్రాయం ఉన్నది. ఇది, వారి జ్ఞానవైభవాన్ని అనుసరించి, వారి రచనల వైభవాన్ని అనుసరించి చేయబడిన సమన్వయం. దివ్య సూరులు అందరూ, మనవలె సంసారంలో ఉండే బద్ధాత్మలే అని, భగవంతుని నిర్హేతుకమైన కృప వల్ల వారు ఏ విధమైన సంశయాది దోషాలు లేని తత్వజ్ఞానాన్ని పొందినవారనే ఇంకొక సమన్వయాన్ని నంబిళ్ళై మొదలైన పూర్వాచార్యులు తెలియజేశారు. ఈ సమన్వయం భగవంతుని నిర్హేతుక కరుణావైభవాన్ని దృష్టిలో పెట్టుకుని చేయబడింది. ఈ రెండువిధాలైన సమన్వయాలలోనూ, రెండవ సమన్వయమే ఎక్కువగా తెన్నాచార్య సంప్రదాయంలో ఆదరింపబడుతున్నది.

ఈ ఆళ్వారులు అందరిలోనూ ప్రధానులు నమ్మాళ్వారులు. వీరు కలియుగం ఆరంభం అయిన 43వ సంవత్సరం అయిన ప్రమాది అనే పేరును కలిగిన సంవత్సరంలో, వృషభమాసం పౌర్ణమితిథిలో, శుక్రవారంనాడు, విశాఖా నక్షత్రంలో, కటక లగ్నంలో, 18 దివ్య దేశాలను కలిగిన పాండ్య దేశంలో, తామ్రపర్ణీ నదీతీరంలో ఉండే తిరుక్కురుగూర్ అని, కురుకాపురి అని వ్యవహరింపబడే దివ్యదేశంలో వేలాళర్ కులంలో అవతరించారు. అక్కడ వంశపారంపర్యంగా భగవంతుడైన శ్రీమన్నారాయణునకు నిత్య కైంకర్యాన్ని చేయడమే పరమపురుషార్థంగా భావించే తిరువళుది వళనాడు భాగవతుని సంతతిలో పొఱ్ఱారియార్ అనేవారు ఒకరు పుట్టారు. వారు, మలయాళ దేశంలో తిరువణ్ పరిశారమ్ అనే దివ్యక్షేత్రంలో ఉండే తిరువాழிమార్బన్ అనే పేరు కలిగిన భక్తుని పుత్రిక అయిన ఉడైయనంగైను వివాహం చేసుకున్నారు. ఈ దంపతులు ఒక పర్యాయం తిరువణ్ పరిశారం అనే క్షేత్రానికి వెళ్లి, అక్కడ కొంతకాలం నివసించి, తరువాత ఊరికి తిరిగి వచ్చేటప్పుడు తిరుకురుఙ్గుడి అనే దివ్యదేశంలో నెలకొని ఉండే నంబి అనే పేరు కలిగిన భగవంతుని సేవించి ఆరాధించి, తమకు పుత్ర భాగ్యాన్ని కలిగించవలసినదిగా ఆ స్వామిని ప్రార్థించారు. అప్పుడు, నంబి అర్చకమూలంగా **“నేనే మీకు పుత్రుడనై జన్మించబోతాను”** అని అనుగ్రహించి, శేషమాలిక, తీర్థం, తులసి, శేష వస్త్రం మొదలైనవాటిని వారికి అనుగ్రహించాడు.

ఆ తరువాత భగవానుడు అనుగ్రహించిన రీతిలోనే ఉడయనంగై గర్భాన్ని ధరించి, తగిన కాలంలో భగవంతుడు, ఆ స్వామి ఆభరణంగా ధరించే కౌస్తుభమణి, విష్వక్సేనులు – అనే ఈ మూడిటి అంశలు కలసిన ఒక మహాపురుషుని ప్రసవించింది. నమ్మాళ్వార్లను భగవంతుడు, అతని పంచాయుధాలు, ఆదిశేషుడు, విష్వక్సేనుడు అనే ఈ ఎనిమిది మంది అంశలతో అవతరించినట్లుగా కూడా కొందరు భావిస్తారు.

ఆళ్వారులు అవతరించిన విషయాన్ని విని ఆదిశేషులు అన్ని కాలాలలోనూ అన్ని దేశాలలోనూ అన్ని స్థితులలోనూ **“నివాస శయ్యాసన పాదుకాంశుకోపధాన వర్షాతప వారణాదిభిః శరీర భేదైః”** (నివాసంగా, శయ్యగా, ఆసనంగా, పాదుకలుగా, ధరించే పీతాంబరంగా, తలదిండుగా, వర్షానికి, ఎండకు రక్షగా ఉండే గొడుగుగా, ఈ విధంగా ఉండే అనేక రూపాలతో) అనే విధంగా భగవంతునకు సేవ చేయడమే స్వభావంగా కలిగినవారు కనుక, ఆ భగవంతుని ఆజ్ఞానుసారం ఆళ్వార్ తిరునగరికి వచ్చి, అక్కడ ఒక చింత చెట్టుగా అవతరించి ఉన్నారు. ఆళ్వారులు అవతరించడానికి 20 సంవత్సరాలకు ముందు, ఈశ్వర సంవత్సరం ఆనిమాసం, మూలా నక్షత్రంలో ఆదిశేషులు

అళ్వార్ తిరునగరిలో చింతచెట్టు రూపంలో అవతరించి, **"నిద్రించని చింత చెట్టు"** అనే పేరును పొంది, ఆళ్వారులకు ఎండ, వర్షం, చలి మొదలైన వాటినుండి ఏ విధమైన బాధ కలుగకుండా కాపాడుతూ వచ్చారు.

లోకంలో, తల్లి గర్భంలో ఉండేటప్పుడే జ్ఞానంతో కూడినవారై ఉండే బిడ్డలు పుట్టిన వెంటనే శఠమనే వాయువు వారిని ఆవరించి వారి జ్ఞానాన్ని మరగుపరచి, ఏడవడం, దొరలడం మొదలైన అజ్ఞాన వ్యాపారాలను చేసేటట్లు చేస్తుంది. ఆ శఠవాయువు, ఆళ్వారులు అవతరించినప్పుడు వారి దగ్గరకుకూడా వచ్చినది. అపుడు వారు ఆ వాయువును తమ హుంకారంతో తరిమికొట్టారు. అందువల్ల వారికి శఠకోపులు అనే పేరు ఏర్పడింది. లోకంలో ఉండే సామాన్య శిశువుల వలె వారు ఏడవడం, మలమూత్రాలను వెలువరించడం, తల్లి దగ్గర పాలను తాగడంవంటి వ్యాపారాలను చేయకుండా ఉన్నప్పటికీ వారి శరీరంలో ఏ విధమైన మార్పు లేకుండా పరమ తేజస్సుతో ప్రకాశించడాన్ని వారి తల్లిదండ్రులు చూచి, చాలా ఆశ్చర్యపడి, **"అవతార విశేషమే ఈ బాలుడు"** అని మనసులో భావించకుండా, ఆ శిశువును తమ బిడ్డగా భావించినవారు అయినందువల్ల, మనసులో చాలా విచారించారు. ఆళ్వారులు అవతరించిన 12వ నాడు ఆ ఊరిలో నెలకొని ఉండే **"పొలిందు నిన్ఱ పిరాన్"** అనే స్వామి సన్నిధికి తీసుకొని పోయి, ఆ బాలుని స్వామిని సేవింప చేశారు. లోకరీతికి మాఱుగా, విపరీతంగా ఉన్న శిశువు కనుక, తమ బిడ్డకు **" మాఱన్"** అనే పేరును పెట్టి, భగవత్ సన్నిధికి సమీపంలో ఉండే, ఆదిశేష స్వరూపమైన చింత చెట్టు నీడలో తొట్టి కట్టి, అందులో పరుండబెట్టి పెంచసాగారు.

ఈ క్రమంలోనే ఆళ్వార్లు 16 సంవత్సరాల వరకు కన్ను తెరవకుండానే మౌనంగానే సమాధిలో ఉన్నారు. వీరి తండ్రి అయిన పొఱ్కారియార్, తల్లి ఉడైయ నంగై **"మనం భగవంతుని విషయంలో ఏదో తగని అపచారం చేశాము. దాని ఫలమే ఇది"** అని మనసులో కలత చెందారు. అయితే, తమవలె జ్ఞానపరిణామాన్ని కలిగిన ఎవరినీ ఈ లోకంలో చూడలేనందున, అళ్వార్లు కన్ను తెరవకుండా మౌనంగానే ఉండిపోయారు –అనే విషయాన్ని వారు తెలుసుకోలేకపోయారు. అప్పుడు, భగవంతుని ఆజ్ఞానుసారంగా విష్వక్సేనులు ఆళ్వారుల దగ్గరకు రహస్యంగా వచ్చి, వారికి సకల సంస్కారాలను చేసి, మంత్రార్థాలను ఉపదేశించారు.

ఈ విధంగా ఆళ్వారులు అవతరించడానికి కొంచెం ముందుగా అవతరించిన మధురకవులు అనే మహానుభావులు ఒకరు ఉత్తర భారతానికి దివ్యదేశయాత్రగా బయలుదేరి వెళ్లారు. వారు ఒకనాడు అయోధ్యా నగరంలో రాత్రి వేళ ఒక అఖండమైన జ్యోతి ఆకాశంలో ప్రకాశించడాన్ని గమనించారు. ఆ జ్యోతి ఏమి? ఎక్కడ నుండి ప్రకాశిస్తున్నది? అనే విషయాన్ని గమనించి తెలుసుకోవాలని భావించి, వారు అక్కడ నుండి బయలుదేరి, దానినే లక్ష్యంగా చేసుకొని ప్రయాణం చేస్తూ, చివరకు తిరుక్కురుకూర్ దివ్య క్షేత్రంలో, ఆళ్వారులు వేంచేసి ఉండే చింత చెట్టు దగ్గరకు వచ్చి, పద్మాసనంలో వేంచేసి ప్రకాశిస్తూ ఉండే ఆళ్వారులను దర్శించారు. వారి అపారమైన తేజస్సును, వారు వేంచేసి ఉండే సన్నివేశ విశేషాన్ని గమనించి, మధురకవులు **"వీరే నాకు ఆచార్యులు, వీరే నాకు దైవం, వీరే నాకు మోక్షం"** అని నిశ్చయించుకొని, మనసారా వారిని శరణు పొందారు. అయినప్పటికీ, **"వీరిలో చైతన్యం ఉన్నదా? కదలకుండా మెదలకుండా ఉన్నారే!"** అని సందేహించి, వారికి ఎదురుగా ఉండే ఒక రాతిని తీసుకొని నేలపై గట్టిగా పడవేశారు. అప్పుడు వచ్చిన శబ్దాన్ని విని ఆళ్వార్లు కన్నులను తెరిచి చూచి, మధురకవులను కృపాకటాక్షాలతో అనుగ్రహించారు. అపుడు, వీరు మాట్లాడగలరా? అని తెలుసుకోవాలని మధుర కవులు అప్పుడు తమ చేతులను జోడించి తలను వంచి, **"స్వామీ! శెత్తత్తిన్ వయిత్తిల్ శిఱియదు పిఱందాల్ ఎత్తై త్తిన్ఱు, ఎంగే కిడక్కుమ్?"** (స్వామీ! చెత్తకడుపులో చిన్నది పుడితే, అది దేనిని తిని, ఎక్కడ ఉంటుంది ? – చెత్త అనదగిన ఈ సంసారంలో జీవుడు జన్మిస్తే, అతడు దేనిని అనుభవిస్తూ ఎక్కడ ఉంటాడు ?) అని అడిగారు. అంటే, అచిత్తు అయిన ఈ శరీరంలో

అణుస్వరూపుడైన జీవాత్మ ప్రవేశిస్తే, ఆ జీవాత్మ దేనిని అనుభవిస్తుంది ? ఎక్కడ ఆశ్రయించి ఉంటుంది? అని దీని తాత్పర్యం. వెంటనే ఆళ్వార్లు దానికి సమాధానంగా **"అత్తై త్తిన్రు అంగే కిడక్కుమ్"** (ఆ శరీరంలో ఏర్పడే సుఖదుఃఖాలను అనుభవిస్తూ, ఆ శరీరాన్నే ఆశ్రయించి ఉంటుంది) అని సమాధానాన్ని చెప్పారు. దీనిని విన్న మధుర కవులు వీరు మహాజ్ఞాని అనే సంగతిని గ్రహించి సాష్టాంగంగా నమస్కరించి చేతులను జోడించి, **"నేను మీ దాసుడను. నన్ను మీ దాసునిగా చేసుకుని నన్ను తరింప చేయాలి"** అని ప్రార్థించారు. ఆళ్వారులు కూడా దానికి సమ్మతించి, వారు చేసే కైంకర్యాలను గ్రహించి, వారికి ఈశ్వర స్వరూపాన్ని, ఉపాయాన్ని, ప్రయోజనాన్ని గూర్చిన పరమ రహస్యాలను అన్నిటిని సాకల్యంగా ఉపదేశించారు.

ఈ విధంగా ఉండగా, పరవాసుదేవుడు ఆళ్వారుల జ్ఞానదృష్టికి లక్ష్యమై, లక్ష్మీదేవితో కలసి గరుత్మంతునిపై వేంచేసి వచ్చి వారికి సాక్షాత్కారాన్ని అనుగ్రహించాడు. శఠకోపులు ఆ భగవానుని దివ్య మంగళ విగ్రహ సౌందర్యాన్ని కనులారా దర్శించి, తమ నేత్రాలలో ఆనంద బాష్పాలు స్రవించగా, నోరారా ఆ స్వామిని స్తుతించారు.

ఆ తరువాత, 108 దివ్య దేశాలలో అర్చారూపాలలో వెలుగొందే భగవన్మూర్తులు ఆళ్వారులు వేంచేసి ఉండే చోటుకు వచ్చి, తమ సాక్షాత్కారాన్ని వారికి కలిగించారు. శఠకోపులు వారి దివ్య గుణాలను అనుభవించినందు వల్ల తమకు కలిగిన ఆనందం పెల్లుబకగా, ఆ అనుభవ పరీవాహ రూపంగా, జీవకోటి సద్గతి పొందేటట్లుగా నాలుగు దివ్యప్రబంధాలను నాలుగు వేదాల సారాలుగా కృప చేశారు. అవి –తిరువిరుత్తం, తిరువాశిరియం, పెరియ తిరువందాది, తిరువాయ్ మొళి అనేవి. వారు వాటిని తమ శిష్యులైన మధురకవులకు ఉపదేశించారు.

అప్పుడు, లోకంలో ఉండే భాగవత శ్రేష్ఠులు, మహర్షులు, శ్వేతద్వీపంలో ప్రకాశించే మహా పురుషులు, వైకుంఠంలో ఉండే నిత్య సూరులు శఠకోపుల మహిమను దర్శించి, వారి దగ్గరకు వచ్చి వారిని సేవించారు. వారిని దర్శించిన ఆళ్వార్లు

**"పొలిగ పొలిగ పొలిగ పోయి*ఱ్ఱు* వల్లుయిర్ శావమ్**
**నలియుమ్ నరకముమ్ నైంద నమనుక్కు ఇంగు యాదొన్రుమిల్లై,**
**కలియుమ్ కెడుమ్ కండుకొణ్ మిన్ కడల్వణ్ణన్ పూదంగళ్ మణ్ మేల్**
**మలియ ప్పుకుందు ఇశై పాడి ఆడి యుఴ్ఱి తరై క్కండోమ్"** (తిరువాయ్ మొ*ఴి*–5–2–1)

(వర్ధిల్లాలి! వర్ధిల్లాలి! వర్ధిల్లాలి! జీవరాసులకు ఇ ఇంతకాలంగా కలిగిన ప్రబలమైన పాపం అంతా తొలగిపోయింది. వారిని బాధపెట్టే నరకలోకాలు నశించిపోయాయి. ఈ లోకంలో యమునకు ఇక ఏ విధమైన పని లేదు. కలిపురుషుడు కూడా త్వరగానే తొలగిపోతాడు. దీనిని సాక్షాత్తుగా గమనించండి. సముద్ర వర్ణుడైన భగవంతుని భక్తుడు ఈ భూమిపై అంతటా వ్యాపించి భగవంతుని కీర్తనలను పాడుతూ ఆడుతూ ఉండడాన్ని చూచాము)

అని అంటూ మంగళా శాసనం చేశారు. ఈ విధంగా ఈ ఆళ్వారులు తమ జీవించిన కాలం అంతా, లౌకిక వృత్తితో కలత చెందకుండా, గొప్ప జ్ఞాన భక్తి వైరాగ్యాలతో వెలిగినవారై, భగవంతుని శ్రీ చరణాలు తప్ప వేరు దేనిని తెలియనివారై, 35 సంవత్సరాల కాలం ఈ భూమిపై వేంచేసి ఉండి, తరువాత తమ స్థానమైన వైకుంఠాన్ని చేరి, అక్కడ తిరుమామణి మండపంలో వేంచేసి ఉండే భగవంతునకు నిత్యసేవను చేస్తూ ప్రకాశిస్తున్నారు. ఇది సంగ్రహంగా నమ్మాళ్వారుల చరిత్ర

తిరుక్కురుకూరులో వేంచేసి ఉన్న పొలిందు నిన్ఱ పిరాన్ వీరికి ప్రేమతో అనుగ్రహించిన ఒకరు పూల మాలికను వీరు సదా ధరించినందు వల్ల ఈ ఆళ్వారులకు వకుళాభరణులు అని, ఇతర మతాలు అనే ఏనుగులను తమ పాశురాలలో అంతర్భవించిన జ్ఞానం అనే అంకుశంతో అణచి నియంత్రించినందు వల్ల పరాంకులు అని ప్రసిద్ధులయ్యారు శ్రీరంగనాథునకు, మిగిలినవారి కంటేకూడా మిక్కిలి ఇష్టమైనవారు కనుక, ఆ స్వామిచే నమ్మాళ్వార్లు అని విలక్షణమైన నామాన్నికూడా వీరు పొందారు. మిగిలిన ఆళ్వారుల వలె ఈ లోకంలోని జీవనాన్ని సాగించకుండా, పుట్టినది మొదలుకొని దివ్యజ్ఞానంతో వెలిగి, దాని నుండి ఏనాడు మారకుండా ఉన్నందువల్ల, ఆళ్వారులు అందరిలోనూ వీరు ప్రధానులు అయ్యారు.

భూతయోగి వీరికి శిరస్సు, సరోయోగి, మహాయోగి అనే ఇద్దరు వీరి నేత్రాలు, భట్టనాథులు వీరి ముఖం, భక్తి సారులు వీరి కంఠం, కుల శేఖరులు, మునివాహనులు వీరి హస్తాలు, భక్తాంఘ్రిరేణులు వీరి వక్షస్సు, తిరుమంగై ఆళ్వారులు వీరి నాభి, మధురకవులు వీరి శ్రీపాదాలు –అని ఈ విధంగా మిగిలిన ఆళ్వారులను అందరినీ తమకు ఆయా అవయవాలుగా కలిగినవారు అయినందు వల్ల వీరు అవయవిగా భావింపబడుతున్నారు.

మీరు భగవంతుని విషయంలో అనన్యమైన భక్తిని కలిగినవారై, ఆ స్వామి శ్రీపాదాలనే ఉపాయంగా, ఉపేయంగా భావించినవారైనందువల్ల, భగవంతుని పాదుకలకు వీరి పేరు అయిన శ్రీశఠకోపమ్ అనే తిరునామం ప్రసిద్ధమైనది. వీరు తమ ప్రబంధాలలో మొత్తం 36 దివ్యదేశాలను గూర్చి ప్రస్తావించారు.

గరుడవాహన పండితుని దివ్యసూరిచరితం, గురుపరంపరాప్రభావం మొదలైన సంప్రదాయ చరిత్ర గ్రంథాలలోనే కాకుండా, ఇతిహాస పురాణాలలో కూడా ఈ ఆళ్వారుల అవతారాన్ని గూర్చిన ప్రస్తావన కనబడుతున్నది..

బ్రహ్మ పురాణంలో, శ్రీమన్నారాయణుడు, బ్రహ్మతో – 28వ కలియుగంలో శఠకోపులు అనే పేరుతో నేనే అవతరించబోతాను. అప్పుడు నేను, సంస్కృత వేదాన్నివలెనే, ద్రావిడ వేదాన్ని కూడా భూమిలో ప్రకాశింప జేస్తాను. ఆ ద్రావిడవేదంవల్ల కలియుగంలో ఉండే జనులు తరించి, ముక్తిని పొందుతారు – అని తెలియజేశాడు. శ్రీమద్భాగవతం 11వ స్కంధంలో **"కలౌ ఖలు భవిష్యంతి నారాయణ పరాయణాః"** ఇత్యాదిగా కలియుగంలో నారాయణుడే పరతత్త్వమనే వాస్తవ తత్త్వాన్ని లోకంలో తెలియజేయడం కోసం ద్రావిడ దేశంలో తామ్రపర్ణీ నదీతీరంలో నమ్మళ్వారులు అవతరించబోయే సంగతి సూచింపబడింది. విష్ణుధర్మం అనే గ్రంథంలో – కలియుగం ఆరంభంలో వైశాఖమాసం విశాఖా నక్షత్రంలో విష్ణుభక్తిని స్థాపించడం కోసం విష్వక్సేనుల అంశతో ఒకరు అవతరించబోయే విషయం చెప్పబడింది.. మార్కండేయ పురాణంలో, నాలుగు వేదాల సారంగా నాలుగు ద్రావిడ దివ్య ప్రబంధాలను అనుగ్రహించడం కోసం శఠకోపముని అవతరించబోతారు అని, వేదంలోని వేయి శాఖలను ద్రావిడపాశురాల రూపంలో వారు అనుగ్రహించబోతారని చెప్పబడింది.

ఇంతే కాకుండా, యజుర్వేద బ్రాహ్మణంలో కాఠకమనే ఒక భాగం ఉన్నది. అందులో **" భరద్వాజో వై త్రిభి రాయుర్భిః బ్రహ్మచర్య మువాస"** అని ఆరంభం అవుతున్న ఒకానొక ఉపాఖ్యానం ఉన్నది అందులో భరద్వాజ మహర్షి అన్ని వేదాలను ఏ లోటు లేకుండా అధ్యయనం చేయాలని కోరి, దానికి తగినట్లుగా ఆయుస్సును పొందడం కోసం ఇంద్రుని ప్రార్థించాడు. ఇంద్రుడు కూడా 300 సంవత్సరాల ఆయుస్సును అతడికి ఇచ్చాడు. ఆ 300 సంవత్సరాల పాటు ఆ మహర్షి వేదాన్ని అభ్యసించాడు. నిర్దేశించిన ఆ సమయం పూర్తి కాగానే, ఇంద్రుడు భరద్వాజ మహర్షి దగ్గరకు వచ్చాడు. భరద్వాజమహర్షి మళ్ళీ ఒక నూరు సంవత్సరాల ఆయుస్సు తనకు కావాలని, తాను అధ్యయనం చేసే వేదాలు ఇంకా పూర్తి కాలేదని అన్నాడు. అప్పుడు ఇంద్రుడు ఆ మహర్షితో **"వేదాలకు అంతు లేదు వాటిని అన్నిటిని**

**ఎవడూకూడా తన జీవితకాలంలో పూర్తిగా అధ్యయనం చేయడం సాధ్యం కాని పని"** – అని అన్నాడు. భరద్వాజ మహర్షి అపుడు చాలా అసంతృప్తి చెందగా, ఇంద్రుడు అతనిని ఊరడించి, "ఓ మునీ! బాధపడవద్దు. **"సహస్ర పరమా దేవీ"** అని కీర్తింపబడే తిరువాయ్ మొళి అనే సావిత్ర విద్యను నీకు ఉపదేశిస్తాను" – అని చెప్పి, ఆ విధంగానే దానిని ఉపదేశించి, **"వేదాలు అన్నిటిలోనూ ఉన్నదానిని అంతటిని దీని మూలంగా తెలియవచ్చు"** అని అన్నాడు. ఇవన్నీ నమ్మాళ్వారుల అవతారాన్నిగూర్చి సూచించే వృత్తాంతాలు.

సంస్కృత వేదాన్ని ద్రావిడ భాషలో అవతరింపజేచినవారు, వీరు –అనే విషయాన్ని **"అరుళినాన్ అవ్వరు మట్రైయిన్ పొరుళ్ పొరుళ్"** (ఆ అరుదైన సంస్కృత వేదాలలో ఉండే అర్థాలను ద్రావిడ భాషలో అనుగ్రహించారు) అని మధురకవులు కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధంలో, **"వేదం తమిழ் శెయ్ ద మాఱన్ శడగోపన్"** (వేదాన్ని ద్రావిడీకరించిన మాఱన్, శఠకోపులు) అని నాథమునులు, **" ఆద్యస్య నః కులపతేః"** అని శ్రీయామునులు, **"వకుళాభరణం వందే జగదాభరణం మునిమ్, యః శ్రుతే రుత్తరం భాగం చక్రే ద్రావిడభాషయా"** (వేదాంతాన్ని ద్రావిడ భాషలో దర్శించినవారు లోకానికి గొప్ప అలంకారంవంటివారు అయిన వకుళాభరణమునికి నమస్కరిస్తున్నాను), **"ఋషిం జుషామహే కృష్ణతృష్ణాతత్వమివోదితమ్ సహస్రశాఖాం యో ౨ ద్రాక్షీ ద్ద్రావిడీం బ్రహ్మసంహితామ్"** (శ్రీకృష్ణభక్తియే మూర్తిభవించినట్లుగా ఉన్నవారు, వేయి శాఖలను కలిగిన బ్రహ్మసంహితను ద్రావిడభాషలో దర్శించినవారైన నమ్మాళ్వారులు అనే ఋషిని సేవిస్తున్నాను) అని పరాశర భట్టర్, **" శీరారుమ్ వేదమ్ తమిழ் శెయ్ ద మెయ్యన్ ఎழில్ కురుగై నాదన్"** (గొప్పతనాన్ని నిండుగా కలిగిన వేదాన్ని ద్రావిడ భాషలో అనుగ్రహించిన యథార్థవాది, ప్రకాశించే కీర్తిని కలిగిన కురుకాపురికి ప్రభువు) అని ఉపదేశరత్తినమాలై ప్రబంధంలో శ్రీమణవాళ మహామునులు నమ్మాళ్వారులను కీర్తించారు. శ్రీరంగామృత కవి అని ప్రసిద్ధులైన అముదనార్ ఇరామానుశ నూత్తందాది ప్రబంధంలోని 18వ పాశురంలో **" ఎయ్ దఱ్కు అరియ మఱైగళై ఆయిరమ్. ఇన్ తమిழாల్ శెయ్ దఱ్కు వరుమ్ శడగోపన్"** (సామాన్యులకు అధ్యయనం చేయడానికి సాధ్యం కాని సంస్కృత వేదాలను వేయి ద్రావిడ పాశురాలుగా అనుగ్రహించడానికి అవతరించిన శఠకోపులు) అని అన్నారు. ఈ విధంగానే, వేదాంతదేశికులవంటి పలువురు ఆచార్యులు వీరి వైభవాన్ని తమ కృతులలో కొనియాడారు.

ఇపుడు, సంగ్రహంగా, వీరు అనుగ్రహించిన, నాలుగు వేదాల సారాలుగా భావింపబడుతున్న నాలుగు దివ్య ప్రబంధాల స్వరూప స్వభావాలను గమనిద్దాం.

## 1) తిరువిరుత్తమ్

ఈ ప్రబంధం, నమ్మాళ్వార్లు అనుగ్రహించిన, నాలుగు వేదాలకు సారాలైన, నాలుగు దివ్యప్రబంధాలలో మొదటిది. ఇది ఋగ్వేద సారమని సంభావింపబడుతున్నది. ఇందులో ఆరంభంలో, అళ్వార్లు తమ జ్ఞాననేత్రానికి ప్రకాశించే భగవంతుని ఉద్దేశించి **"పొయ్ న్నిన్ఱ ఞానమ్ పొల్లా ఒழுక్కుమ్ అழுక్కుడమ్బుమ్ ఇన్నిన్ఱ నీర్మై ఇని యాముఱామై ––– అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పమే"** ఇత్యాదిగా **"నిన్ను సదా దర్శించి ఆనందించడానికి అవరోధంగా ఉండే దేహసంబంధాన్ని లేకుండా చేయాలి"** అని విజ్ఞాపన చేశారు. ఇందులో నూరు పాశురాలు ఉన్నాయి. ఈ ప్రబంధంలో ప్రారంభం, ఈ ప్రబంధ ప్రయోజనాన్ని తెలియజేసే చివరి పాశురం –అనే ఈ రెండు పాశురాలు తప్ప, మిగిలిన పాశురాలు అన్ని అలౌకికమైన, పారమార్థికమైన శృంగారసానుభవప్రక్రియలోనే రచింపబడ్డాయి. అన్యాపదేశం

స్వాపదేశం – అనే క్రమాలలో అపూర్వమైన వేద తత్త్వాలను వ్యక్తం చేసే వ్యంగ్యార్థాలు ఈ పాశురాలలో అంతటా బాసిస్తున్నాయి ఈ పాశురాలలోని పదప్రయోగాలు ఎంతో సుందరమైనవి. వీటి ద్వారా తెలియబడే అర్థాలు సహృదయ హృదయాలను రంజింప జేస్తాయి చాలా గంభీరమైన ధ్వన్యర్థాలను, అపూర్వమైన అలంకారాలను కలిగినదై, ద్రావిడ సాహిత్యంలోనే కాకుండా, ప్రపంచ సాహిత్యంలోనే ఒక విలక్షణమైన స్థానాన్ని ఈ ప్రబంధం అలంకరిస్తున్నది.

**"ఆత్మా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః"** అని వేదంలో విధింపబడిన, పరమ ప్రాప్యమైన, జీవుని స్వరూపానికి తగినది అయిన, భగవద్విషయకమైన ప్రీతియే అళ్వారుల ప్రబంధాలలో శృంగారంగా ప్రస్తుతింపబడింది. **" భక్తిః శృంగారవృత్త్యా పరిణమతి భావబంధప్రథిమ్నా"** – అని దేశికులు ద్రవిడోపనిషత్ తాత్పర్య రత్నావళి ఆరంభంలో చెప్పినట్లుగా, భగవంతుని విషయంలో ఉండే భక్తి భక్తుని హృదయంలో అతిశయించినప్పుడు, అది శృంగార రసంగా పరిణమించడం సహజం. అందువల్ల ఆళ్వారులు తమ ప్రబంధాలలో శృంగార భావనతో పాడిన పాశురాలు అన్నీ జీవస్వరూపానికి అనుగుణమైనవే తప్ప, లౌకికమైన, తుచ్ఛమైన శృంగారాన్ని తెలిపేవి కావు.

భగవంతుని శృంగారరస ప్రక్రియలో అనుభవించే క్రమం ద్రావిడ భాషలో ఆళ్వారుల సాహిత్యంలోనే కాకుండా, శైవసాహిత్యంలో కూడా గోచరిస్తున్నది శైవసంప్రదాయానికి చెందిన మాణిక్యవాచకర్ అనే కవి రచించిన **"తిరుచిత్తంబలక్కోవై"** అనే కావ్యం మొదలైనవాటిలో ఇది గోచరిస్తుంది. అటువంటి క్రమమే ఈ తిరువిరుత్త ప్రబంధంలో మనకు కనబడుతున్నది.

ఈ ప్రబంధం ద్రావిడసాహిత్యలక్షణానుసారం **"అకత్తుఱై"** అనే విభాగానికి చెందినది. **"అకమ్"** అంటే లోపల, ఇల్లు అని అర్థం. **"అహం"** అనే సంస్కృతశబ్దానికి వికృతి అయిన ఈ పదం ఇక్కడ ఆత్మను, మనసును నిర్దేశిస్తూ, కావ్యంలో నాయకీనాయకుల ఆంతరమైన అనుభవాలను వర్ణిస్తుంది. ఈ విభాగంలో నాయకీనాయకుల ప్రణయం, వారి సంశ్లేషం, విరహం, దానివల్ల కలిగే ఆర్తి, మళ్లీ వారు కలసినప్పుడు ఏర్పడే ఆనందం మొదలైన విషయాలు వర్ణింపబడతాయి. తిరువిరుత్తం అంతా ఇటువంటి క్రమంలోనే గోచరిస్తుంది. ఇందులోని పాశురాలు పైపైకి నాయకీ నాయకుల సామాన్యమైన లౌకిక శృంగారాన్ని వర్ణించినట్లు కనబడుతున్నా, లోపల గమనించి చూస్తే, అలౌకికమైన, పరమ పురుషునకు, జీవాత్మకు సంబంధించిన అనుభవాన్ని తెలియజేసేవై, చేతనునకు పరమ పురుషుని అనుభవం తప్ప, మిగిలిన ఏది కూడా ప్రాప్యం కాదనే పరమార్థాన్ని తెలియజేస్తాయి. **"స్త్రీప్రాయ మితరం జగత్"** అని భగవంతుడు తప్ప మిగిలిన జీవులందరూ కూడా స్త్రీసమానులే – అని శాస్త్రం చెబుతున్నది. జీవుడు, తన పతికే శేషమై, అనన్యభోగ్యమై ఉండే పత్నివలె, అన్ని విధాలుగాను, అన్ని వేళలలోనూ, అన్ని దశలలోనూ భగవంతునకే శేషభూతుడై. ఆ స్వామి ఆనందం కోసమే ఉపయోగపడవలసినవాడు – అనే తత్త్వం దీనివల్ల చెప్పబడుతున్నది. ఇందువల్ల భక్తుల భక్తి ఉన్నతమైన దశను చేరినప్పుడ, అది అలౌకికమైన, భగవద్విషయకమైన శృంగార భావనగా పరిణమించడం అనేది ఆత్మ స్వరూపానికి తగినది. శ్రీరామాయణంలో మహర్షులు శ్రీరాముని విషయంలో ఆశపడడం, గోపికలు శ్రీకృష్ణుని కామించడం అని మొదలైనవి అన్నీ ఈ అర్థాన్నే తెలుపుతాయి. అపూర్వాలైన, వైదికమైన ఈ తత్త్వాలను లౌకికమైన అందమైన శృంగార రస ప్రక్రియతో గుడజిహ్వికాన్యాయంలో మేళవించి, ఆళ్వారులు ఉపదేశించారని పూర్వాచార్యులు వ్యాఖ్యానించారు.

ఈ ప్రబంధానికి నంబిళ్ళై, పెరియ వాచ్చాన్ పిళ్ళై, వాదికేసరి అళగియ మణవాళ జీయర్, అప్పిళ్ళై, పెరియ పరకాలస్వామి అనేవారు రచించిన ఐదు వాఖ్యానాలు, పెరియ వాచ్చాన్ పిళ్ళై రచించిన వ్యాఖ్యానానికి వివరణగా ఏర్పడిన మూడు అరుంబద వివరణలు ఉన్నాయి. ఈ మూడు వివరణలలో – అప్పు వరైయర్ కూర్చినది ఒకటి.

కోనప్పంగార్ అరుంబదం కూడా ఉన్నదని ప్రసిద్ధి. పరకాల స్వామి వ్యాఖ్యానం వడగలై సంప్రదాయాన్ని అనుసరించి ఉంటుంది.

ఈ ప్రబంధంలో ఉండే ద్రావిడ శృంగారస ప్రక్రియాభేదాలను వివరించే గ్రంథాలు –. తొల్కాప్పియం గ్రంథంలో పొరుళ్ అధికారం, తిరుక్కోవైయార్, అంబికా పతి కోవై, వీరశోழியమ్ – అనేవి వాటిలో కొన్ని.

సంస్కృతంలో కొన్ని వేదవాక్యాలు, జయదేవుడు రచించిన గీత గోవిందం, తీర్థ నారాయణస్వామి రచించిన కృష్ణలీలా తరంగిణి, తెలుగు భాషలో క్షేత్రయ్య పదాలు, క్రైస్తవ మతానికి చెందిన సాల్మన్ గీతాలు, ఇస్లాం మతంలో సూఫీ తెగకు చెందిన పరమ వేదాంత సూక్తులు అనేవి ఈ తిరువిరుత్త పాశురాలవంటివే.

ఆళ్వార్లు తమను నాయకిగా భావించి, భగవంతుని విషయంలో తమకు కల మనోరథాన్ని ఈ ప్రబంధంలో తెలియజేసినందు వల్ల ఈ ప్రబంధానికి తిరువిరుత్తం అనే పేరు చాలా తగినది. నాలాయిర దివ్య ప్రబంధంలో ఇయఱ్పా అనే మూడవ సహస్రంలో కూర్చబడిన ప్రబంధాల క్రమంలో ఐదవ ప్రబంధమైన దీనికి కిడాంబి ఆచ్చాన్ అనే భగవద్రామానుజుల శిష్యులు ఒకరు తనియన్ పాశురాన్ని అనుగ్రహించారు.

ఇప్పుడు, ఈ ప్రబంధంలో ఉండే కొన్ని పాశురాలలోని విశేషాలు సంగ్రహంగా ప్రస్తావించబడుతున్నాయి ఈ ప్రబంధంలోని మొదటి పాశురం ఈ విధంగా ఉన్నది.

**పొయ్ నిన్ఱ ఞానముమ్ పొల్లా వొழுక్కుమ్ అழுక్కుడంబుమ్**
**ఇన్నిన్ఱ నీర్మై ఇనియాముఱామై– ఉరురళిప్పాన్**
**ఎన్నిన్ఱ యోనియుమాయ్ పిఱందాయ్ ఇమైయోర్ తలైవా!**
**మెయ్ న్నిన్ఱు కేట్టరుళాయ్ అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పమే.**

ఈ పాశురంలో భగవంతుని తమ జ్ఞాననేత్రానికి విషయంగా పొందిన ఆళ్వారులు ఆ స్వామిని ఉద్దేశించి, అతని సమక్షంలో తాము చెప్పే విజ్ఞాపనను అతడు విని అనుగ్రహించాలి – అని అంటున్నారు. సమస్త జీవులను రక్షించడం కోసంగా అనేక విధాలుగా ఉండే జన్మలను ఎత్తినవాడా! దేవదేవా! అయథార్థమైన జ్ఞానంతో, తగని ప్రవర్తనతో, అశుద్ధమైన దేహ సంబంధంతో కూడిన ఈ సంసారంలో కలిగే దుఃఖాన్ని ఇక నేను పొందకుండా ఉండేటట్లుగా నీవు నన్ను అనుగ్రహించాలి – అని నేను చేసే ఈ విజ్ఞాపనను నీవు విని, ఆ విధంగా కటాక్షించాలి –అని అంటున్నారు.

**"కుழఱ్కోవలర్"** ఇత్యాది రెండవ పాశురం, భగవంతుడనే నాయకుని కలసి విశ్లేషించి, ఆ విశ్లేషాన్ని సహించలేనిది అయిన నాయకిలో కలిగిన మార్పును చూసి, ఆశ్చర్యాన్ని పొందిన ఆమె సఖి పలికే పాశురంగా అవతరించింది.

నీలమేఘశ్యాముడైన కృష్ణుని పాదాలలో ప్రేమను కలిగిన ఈ నాయకికి ఎర్రని రేఖలను కలిగిన కన్నులు అతనిని విశ్లేషించిన దుఃఖం పెల్లుబికిన నీరు నిండిపోగా, తడబడుతున్నాయి. నీ ప్రేమ దశ అనే ఈ స్థితి ఎప్పటికీ ఈ విధంగానే నిలచి ఉండడం కోసం దుఃఖం తొలగి ఈమె ఉజ్జీవించాలి. – అని ఇందులో సఖి అంటున్నది.

భగవంతుని శ్రీపాదాలలో ఆళ్వార్లకు ఏర్పడిన ప్రేమాధిక్యం చత వారి కన్నులు కలత చెందగా, దానిని చూసి ఆశ్చర్యాన్ని పొందిన వారి భక్తులు చెప్పే సూక్తి ఇది – అనేది ఈ పాశురంలోని స్వాపదేశార్థం, అంటే, ధ్వన్యర్థం. ఇక్కడ ఆళ్వారులు నాయకి. భగవంతుడు నాయకుడు. వారి భక్తులే చెలికత్తె స్థానంలోనివారు. భగవంతుడు ఒక సారి అళ్వారుల జ్ఞాననేత్రానికి గోచరుడైనప్పుడు, అతనిని వెంటనే చేరాలని అళ్వార్లు కోరగా, ఆ విధంగా భగవంతుడు వారిని

తన దగ్గరకు చేర్చుకోనందున, అదృశ్యమై పోయినందున ఆళ్వారులకు ఏర్పడిన విశ్లేషవ్యసనమే ఈ నాయకి అనుభవించే దుఃఖం. ఈ విధంగానే మిగిలిన పాశురాలలో కూడా సాంప్రదాయికమైన ధ్వన్యర్థాలను గ్రహించాలి.

**"ఇాలమ్ పనిప్ప"** ఇత్యాది ఏడవ పాశురంలో– **"వర్షాకాల సమయానికి నేను తిరిగి వస్తాను"** అని చెప్పి, కాలాన్ని నిర్దేశించి వెళ్లిన నాయకుడు, ఆ విధంగా వర్షాకాలం వచ్చినప్పటికీ రానందువల్ల, నాయకుని విశ్లేషంచేత బాధపడే నాయకితో ఆమె సఖి – అతడు చెప్పిపోయిన వర్షాకాలం ఇది కాదు. **"ఆకాశంలో ఇప్పుడు కనిపించేది మేఘాలు కావు. ఒకదానితో ఇంకొకటి పోరాడుతున్న నల్లని ఎద్దులే సుమా!"** అని కాలాన్ని మార్చి మరుగుపరచి పలికి, ఆమెకు ఆశ్వాసాన్ని కలిగించడం విషయం.

దీనికి ద్రావిడాలంకారిక ప్రక్రియలో **"కాలమయక్కు"** అని పేరు. ఆళ్వారులు పొందిన భగవద్విషయంలోని ప్రేమాధిక్యానికి తగిన విధంగావారు వెంటనే భగవంతుని దగ్గరకు చేరి, ఆ స్వామిని అనుభవించి, మహానందాన్ని పొందడానికి తగిన కాలమై ఉండగా, ఆ విధంగా చేరలేక, ఆలస్యం అయినందువల్ల, **"అవివేకం ఆవరించి, పలు విధంగా క్లేశాలను కలిగించే సంసారం అనే ముగిసిపోని పెద్ద వర్షాకాలంలో చిక్కుకున్నాను"** అని వారు బాధపడుతూ ఉండేటప్పుడు, **"సంసారానికి కారణమైన ఆ త్రిగుణాలను కలిగినవారు లోకం భయపడేటట్లుగా పరుగులు తీస్తూ ఒకరితో ఇంకొకరు పోరాడుతూ, స్థితి చెడేటట్లు స్పర్ధించే భూమి కదా, ఇది"** అని అంటూ పలికి ఆళ్వారులకు, వారి సమీపంలో ఉండే శ్రీవైష్ణవులు ఊరటను కలిగించడమే ఈ పాశురంలోని వ్యంగ్యార్థం.

**"వారాయిన ములైయాళ్"** ఇత్యాది 53వ పాశురంలో కట్టువిచ్చి (సోదికత్తె) పలకడం కనిపిస్తుంది. నాయకునకు దూరమైనందువల్ల నాయకికి ఏర్పడిన బాధకు పరిహారం ఏదో? అని ప్రశ్నించిన పెంపుడు తల్లి మొదలైనవారిని ఉద్దేశించి కట్టువిచ్చి నాయకికి ఏర్పడిన వ్యాధికి తగిన పరిహారాన్ని పలికే పాశురం ఇది – అని అళగియ మణవాళ చ్చీయర్ అనే వ్యాఖ్యాత వ్యక్తంగా ఉండే అర్థాన్ని తెలియజేశారు.

ఆళ్వారుల, సహించలేని భగవద్విశ్లేషవ్యసనాన్ని చూసిన జ్ఞానులు, దానికి పరిహారం ఏదోకదా? అని కలత చెందినప్పుడు, కారణకార్యస్వభావాన్ని తెలిసిన నిరూపకులు, **"భగవంతుని విషయంలో ఆళ్వారులు కలిగి ఉండే భక్తి చేత ఏర్పడిన ఈ క్లేశానికి దానికి సంబంధించిన పరిహారాన్ని చేయడమే తగిన పరిష్కారం"** అని చెప్పడమే ఈ పాశురంలోని స్వాపదేశార్థం.

**"వీశుమ్ శిఱకాల్"** అనే 54 వ పాశురంలో తుమ్మెద ద్వారా నాయకుని దగ్గరకు నాయకి సందేశాన్ని పంపించే సన్నివేశం గోచరిస్తుంది. ఇందులో ఆళ్వారులు తమ విరహార్తిని ఆచార్యుల ద్వారా భగవంతుని తెలియజేసి, తమ ఆర్తి తీర్చమని భగవంతుని ప్రార్థించ వలసినదిగా తమకోసం పురుషకారం చేయమని ఆచార్యులను ప్రార్థించడం ఇందులోని స్వాపదేశార్థం.

**"వాశకమ్ శెయ్ వదు"** ఇత్యాది 61వ పాశురంలో, సఖి, నాయకుని స్వభావాన్ని గూర్చి నాయకికి చెప్పడం కనిపిస్తుంది. **"అతడు గొప్పవాడే అయినా, మనకు సులభుడై ఉంటాడు, గమనించు"** అని నాయకుని పొగడడం ఇందులోని విషయం. భగవంతుని దగ్గరకు చేరాలని త్వరపడుతున్న ఆళ్వారుల ఆర్తిని చూచిన వారి స్నేహితులు ఉభయ విభూతినాథుడైన సర్వేశ్వరుడు భక్తులకు సులభుడై, శ్రీకృష్ణుడై, ఈ లోకంలో అవతరించి వర్తించిన రీతిని వర్ణించడం సాధ్యమా? అని ఆ స్వామి సౌలభ్యాన్ని గూర్చి పలికి, ఆళ్వారుల ఆర్తిని తీర్చడం ఈ పాశురంలోని ధ్వన్యర్థం.

**"కఱ్ఱుప్పిణైమలర్"** అనే 65వ పాశురంలో, **"లేత వయస్సులో ఉండే జింకపిల్ల బెదురుతూ చూచే చూపుల కంటే ఈమె చూపులు చాలా అందమైనవి"** అనే విషయాన్ని తెలియజేస్తూ నాయకి చూపులలోని గొప్పతనాన్ని చూచి,

నాయకుడు తన అభిప్రాయాన్నిగూర్చి పలకడమే ఈ పాశురంలో పైపైన వ్యక్తం అవుతున్న అర్థం. ఆళ్వారుల జ్ఞానంలో భాగవతులు చాలా అభినివేశాన్ని పొంది, పల్కడం ఈ పాశురంలోని స్వాపదేశార్థం.

**"తైయర్ నల్లార్"** ఇత్యాది 84వ పాశురంలో, నాయకి నాయకుని చూడాలని త్వరపడి వెళ్లే సందర్భం కనిపిస్తుంది. నాయకుని విరహానికి నాయకి **" అతడు, నా ఆశ తీరేటట్లుగా నన్ను ఒంటరిగా చూచి, నేను ఆనందాన్ని పొందేటట్లుగా ఉండే అవకాశం లభించకపోయినా, అందరూ కలసి ఉండే గోష్ఠిలో ఎక్కడ అయినా దర్శించే అవకాశం లభించినా, అది చాలు, దానితో నేను ఆశ్వాసాన్ని పొందుతాను"** అని భావిస్తున్నది. అదే జ్ఞాపకంతో నాయకుడు తనకు ఎదురుగా నిలుచున్నట్లుగా తలచి పలుకుతున్నది.

మనసు అనే ఆంతరనేత్రంతో భగవంతుని దర్శించిన ఆళ్వారులు, ఆ స్వామిని మళ్లీ మళ్లీ ఎక్కడ అయినా దర్శించాలని ఆశపడి, అతనిని ఉద్దేశించి తనలో పలికే సూక్తియే ఈ పాశురంలోని స్వాపదేశార్థం.

**"శురుంగు ఉటి వెణ్ణెయ్"** అనే 91వ పాశురంలో, సఖికి నాయకి తన సహజమైన శీలాన్ని గూర్చి తెలియజేసి సన్మార్గంలో వర్తించడం గోచరిస్తుంది. నాయకి, ఇతరులు తెలియకుండా లక్ష్మీనాథుడు అనే నాయకునితో కలసి ఉండగా, దానిని తెలియని ఆమె తల్లిదండ్రులు ఆమెను ఇతరులకు ఇచ్చి వివాహం చేయాలని పలికినప్పుడు, ఆమె తన స్థితిని తన సఖి ద్వారా తన పెంపుడు తల్లికి, ఆమె ద్వారా తల్లికి, ఆమె ద్వారా తండ్రికి, ఇంకా మిగిలిన బంధువులకు, పెద్దలకు తెలియజేయడం, తెలియజేసి తనను ఆ నాయకునికి ఇచ్చి వివాహం చేసేటట్లుగా ఉండే తన అభిప్రాయాన్ని చెలికత్తె దగ్గర వ్యక్తం చేయడం ఇందులోని విషయం. ఈ విధంగా నాయకి తన శీలాన్ని ప్రకటించడమే ఆమె సన్మార్గంలో నిలువడం

తన భక్తుల విషయంలో గొప్ప ప్రేమను కలిగినవాడు, ఆపదలను తొలగించేవాడు, అన్నిటినీ తెలిసేవాడు అయిన భగవంతుని తప్ప వేరు ఏ విషయాన్ని నా మనస్సు తెలియదు – అని అళ్వార్లు తన స్నేహితులతో ప్రస్తావించి పలకడమే ఇందులోని ధ్వన్యర్థం.

**"పేణ్ నలమిల్లా"** అనే 92 వ పాశురంలో, **"తోళ్ కండార్ తోళే కండార్"** (శ్రీరాముని భుజసౌందర్యాన్ని దర్శించినవారు ఆ భుజసౌందర్యాన్నే దర్శించారు) అనే విధంగా, నీ అందమైన పాదాలలోని ఒక అంశాన్ని కన్నులు చల్లబడేటట్లుగా దర్శించి అనుభవించడం పరమానందాన్ని ఇస్తుంది.. అయితే, దేవతలు దానిని ఆశపడి కోరకుండా, నీ పాదాలపై పడి, ఎల్లప్పుడూ తమ శత్రువులను నశింపచేయాలి– అని ప్రార్థించడం అనేది ఏమి? అని నాయకి వారిని నిందిస్తూ వాపోతున్నది.

ఇందులోని పరమార్థం ఏమి అంటే, **"భగవంతుని మధురమైన దివ్య మంగళ విగ్రహాన్ని అనుభవించాలని ఆశపడకుండా దేవతలు – అతడు ఈ భూమిలోకి వచ్చి జన్మించి, తమ శత్రువులను నశింపజేసి తమ కోరికలను నెరవేర్చాలని వేడి, అన్య ప్రయోజనాలలో ఆసక్తిని కలవారై ఉండడం చాలా గర్హించదగినది. భగవంతుని అనుభవించడమే కోరదగినది"** అనేది.

**"కాలై వెయ్యోఱ్కు"** అనే 93వ పాశురంలో, నాయకి, భగవంతుని విశ్లేషించి ఆ విరహాన్ని సహించలేక తపిస్తూ ఉండగా, సూర్యుడు అస్తమించాడు. చీకటి అంతటా వ్యాపించింది. నాయకి ఆశ మరింత హెచ్చు అయింది. ఆ చీకటి స్వామి యొక్క నల్లని తిరుమేనిని జ్ఞాపకం చేస్తున్నది. నాయకి బాధ అందువల్ల అతిశయించిగా, తన బాధకు అతని నామానుసంధానమే పరిహారం అని ఆమె భావించి, దానిని గమనించి నిర్వహించవలసినదిగా తన చెలికత్తెను, పెంపుడు తల్లిని గర్హిస్తూ పలుకుతున్నది.

ఇందులోని పరమార్థం ఏమిటంటే, లోకంలో పలువురు ఉదయం, సాయంకాలం అనేవి మాటిమాటికి రావడాన్ని, ఆ విధంగా కాలం గడిచిపోయే రీతిని చూసి కూడా, తమ బాల్యం, దేహం అస్థిరంగా ఉండే స్థితిని గమనించినా, వారు, భగవంతుని విషయంలో ఆసక్తి లేకుండా, వ్యర్థంగా కాలాన్ని గడుపుతున్నారే! తమ ఉజ్జీవనాన్ని గూర్చి చింతించడం లేదే! అని ఆళ్వారులు వాపోతూ దుఃఖించడమే. జీవులను సంస్కరించి తరింప చేయడం కోసం వీరు అవతరించడం వల్ల, సహజంగా కరుణానిధి అయినందువల్ల, ఇతరుల కీడును చూచి భరించలేని దుఃఖాన్ని పొందేవారు, వీరు – అనే విషయం ఇక్కడ వ్యక్తం చేయబడింది.

**"తుంజా మునివరుమ్"** అనే 98వ పాశురంలో, నాయకుని గొప్పతనాన్ని చూచి, నాయకి, అటువంటివాడు చాలా తక్కువ దానిని అయిన నన్ను వేగంగా వచ్చి స్వీకరిస్తాడా? అని చాలా బాధపడుతూ ఉండగా, ఆమె సఖి, అటువంటి గొప్పవానికి తన భక్తుల విషయంలో సులభుడుగా ఉండే స్వభావం అనేది సహజంగానే ఉన్నది. అతడు నిన్ను తన దానినిగా చేసుకోకుండా ఉండడు –అని పలికి, ఆమెను ఊరడించడం అనేది విషయం.

భగవంతుని పరత్వంలోనూ, సౌలభ్యంలోను ఉండే మాధుర్యం ఎంతటి వారికైనా, **"ఇంతటిది"** అని పరిచ్ఛేదించి పలకడానికి సాధ్యం కాదు – అని అళ్వార్లు తెలియజేయడమే ఇందులోని తత్త్వం.

**"ఈనచ్చొల్లాయినుమ్"** అనే 99 వ పాశురంలో, నాయకుని విషయంలో తనకు గల ఆశను నాయకి తన సఖితో ఈ విధంగా చెబుతున్నది.

ఊరిలోనివారు నిందించనీ, పెంపుడు తల్లి కాదని అననీ, వారు పలికే నిందలు ఊరిలో అంతటా వ్యాపించనీ. ప్రళయకాలంలో ప్రళయ సముద్రంలో లోతుగా మునిగిన భూమిని వరాహమూర్తియై ఉద్ధరించిన నా స్వామి, దేవతలకు, మానవులకు అందరికీ జ్ఞానాన్ని అనుగ్రహించి కాపాడే నాయకుడు అయిన భగవంతుని తప్ప, నేను తెలిసిన మంచి అర్థం వేరొకటి ఏమీ లేదు – అనేదే ఈ పాశురంలోని పరమార్థం. **"సంసారం అనే మహా సముద్రంనుండి నన్ను ఉద్ధరించే రక్షకుడుగా నేను భగవంతుని మాత్రమే భావిస్తున్నాను"**– అని తమ సిద్ధాంతాన్ని ఆళ్వారులు తమ స్నేహితులతో ఇందులో పలుకుతున్నారు.

నల్లార్ నవిల్" అనే, చివరిది అయిన నూఱవ పాశురం ఫలశ్రుతి పాశురం. సద్గుణాలను, సత్కార్యాలను కలిగినవారు కొనియాడే తిరుక్కురుకూర్ దివ్య క్షేత్రంలో అవతరించి, లక్ష్మీనాథుని తిరునామాలను అనుసంధించే భక్తుల శ్రీపాదాలు అనే పూమాలికను తన శిరస్సులో అలంకరించుకున్న నమ్మాళ్వార్లు సర్వేశ్వరుని సన్నిధిలో విజ్ఞాపనం చేసిన ఈ వాఙ్మాలిక అనే నూరు పాశురాలను అధ్యయనం చేయగలిగినవారు, జన్మ మరణాలకు కారణమైన, అనాది అయిన కర్మ బంధం అనే బురదతో నిండిన ఈ సంసారంలో మునిగిపోరు– అని ఇందులో ఆళ్వారులు అంటున్నారు.

ఈ విధంగా ఈ ప్రబంధంలో అనేక విధాలయిన ద్రావిడ సాహిత్యంలోని శృంగారరసప్రక్రియలలో పాడిన పాశురాలు ఎన్నో కనిపిస్తాయి. ఇవి అన్నీ అలౌకికమైన భగవద్భక్తిని వ్యక్తం చేసే రసగుళికలు. వ్యాసవిస్తరణ భయంచేత వాటిని ఎక్కువగా ఇక్కడ ప్రస్తుతించడం లేదు.

ఈ ప్రబంధంలో ఉండే నూరు పాశురాలు, తిరువాయ్ మొళి ప్రబంధంలోని నూరు దశకాలు పరస్పరం వివరణ వివరణాభావాన్ని కలిగి ఉన్నాయి. ఈ వివరం పూర్వం ముద్రింపబడిన నాలాయిర దివ్య ప్రబంధ కోశాలలో కూర్చబడడాన్ని గమనించవచ్చు. నూరు శాఖలను కలిగిన ఋగ్వేదమే స్తోభాదులతో గానరూపంగా విస్తరించి, సహస్ర శాఖాత్మకమైన సామవేదమై రూపొందినట్లే ఇది కూడా– అని నాయనార్ అనే ఆచార్యులు ఆచార్య హృదయ గ్రంథంలో

తెలియజేశారు. తిరువాయ్ మొళి ప్రబంధం సహస్ర శాఖాత్మకమైన సామవేదంతో సమానమని కదా సంప్రదాయంలో ప్రసిద్ధి.

ఈ ప్రపంచంలో వరాహావతారం, నరసింహావతారం, వామనావతారం, శ్రీరామావతారం, శ్రీకృష్ణావతారం అనే ఐదు అవతారాలు, పరమపదం, శ్రీరంగం, వేంకటాచలం, తిరువెక్కా, క్షీరాబ్ధి అనే ఐదు దివ్యదేశాలు కీర్తింపబడ్డాయి. ఇది తిరువిరుత్త ప్రబంధానికి సంబంధించిన, కేవలం చాలా సంగ్రహమైన పరిచయం మాత్రమే.

## 2) తిరువాశిరియమ్

ఈ ప్రబంధం ఇయఱ్పా అనే విభాగంలో కూర్చబడిన ఆఱవ ప్రబంధం. ఇది యజుర్వేదసారం అని పెద్దలు భావిస్తున్నారు. ఇందులో ఏడు పాశురాలు ఉన్నాయి. ఈ ప్రబంధానికి అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్ అనే పేరు కలిగిన, భగవద్రామానుజుల శిష్యులైన మహనీయులు ఒకరు తనియన్ పాశురాన్ని అనుగ్రహించారు. ఈ ప్రబంధానికి పెరియ వాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించిన, మణిప్రవాళ శైలిలోని వ్యాఖ్యానం, దానికి పెద్దలు కూర్చిన అరుంబదం, మాడభూషి రామానుజాచార్యులవారిచేత రచించబడిన ప్రతిపదార్థం – అనేవి ఉన్నాయి.

**"ఆశిరియ ప్పా"** అనే ద్రావిడ ఛందస్సులో ఈ ప్రబంధం రచింపబడినందువల్ల ఈ ప్రబంధానికి తిరువాశిరియం అనే పేరు వచ్చింది. ద్రావిడ భక్తి సాహిత్యంలో ఈ ఛందస్సులో రచింపబడి, రచింపబడిన ఛందస్సు పేరుతో వ్యవహరింపబడిన మొట్టమొదటి ప్రబంధం ఈ తిరువాశిరియ ప్రబంధం. తిరువిరుత్త ప్రబంధంవలె ఇది కూడా అందాది క్రమంలో రచింపబడిన ప్రబంధమే. యజుర్వేదం ఏడు కాండలను కలిగినది. ఆ ఏడు కాండల సారాన్ని ఆళ్వార్లు ఈ ప్రబంధంలోని ఏడు పాశురాలతో ద్రావిడీకరించారు. ఈ ప్రబంధం పరిమితిలో చిన్నదే అయినప్పటికీ అర్థంలో చాలా గొప్పది. శబ్ద మాధుర్యాన్ని, అర్థగాంభీర్యాన్ని కలిగిన గొప్ప ప్రబంధం ఇది. యజుర్వేదం ఇంచుమించుగా గద్యరూపంలో అవతరించింది. దానిని అనుసరించి ఈ ప్రబంధం కూడా అదే క్రమంలో ఉండే వృత్తంలో ఏర్పడింది. యాగాల నిర్వహణ క్రమాన్ని యజుర్వేదం వివరిస్తున్నది. యాగాలన్నిటిచేత ఆరాధింపబడే భగవంతుడైన లక్ష్మీనాథుని ఈ ప్రబంధం స్తుతిస్తున్నది.

నమ్మాళ్వార్లు తమ మొదటి ప్రబంధమైన తిరువిరుత్తంలో ప్రార్థించిన విధంగా భగవంతుడు వారికి వెంటనే సంసార సంబంధాన్ని తీర్చలేదు. పరమపదంలో వీరు కోరిన భగవదనుభవాన్ని ఇక్కడే కలిగించి, ఇంకా వీరి ద్వారా కొన్ని దివ్యప్రబంధాలను లోకోపకారం కోసం అవతరింప జేయాలి –అని భగవానుడు భావించి, తన అనుభవాన్ని ఆళ్వార్లకు మానసికంగా సాక్షాత్కరింప చేశాడు. అప్పుడు, తాము మానసికంగా పొందిన భగవదనుభవాన్ని ఈ ప్రబంధంలో ఆళ్వార్లు లోకంలో ఉండే అందరూ కూడా తెలుసుకొని ఆనందించాలని, దానిని ఈ ప్రబంధంలో ఉండే పాశురాల ద్వారా ప్రకటిస్తున్నారు. వీరు, భగవంతుని స్వరూపరూప గుణవిభూతులను ప్రత్యక్షంగా అనుభవించారు – అనే విషయం **"మూవులకు అళంద శేవడియోయే! "** (1) (ముల్లోకాలను కొలిచిన అందమైన శ్రీపాదాలను కలవాడా!) అని అంటూ మొదటి పాశురంలోనే పలికినందువల్ల తెలుస్తున్నది.

భగవంతుని స్వరూపరూప గుణవిభూతులలో, స్వరూపం అనేది సహజమైన స్వభావం. అది ఎప్పటికీ ఏ విధంగానూ మారకుండా ఉంటుంది. భగవంతుడు నిత్యుడు అంటే. ఎల్లప్పుడూ ఉండేవాడు అవికారుడు. అంతే కాకుండా, ఆ స్వామి రూపం కూడా ఎప్పుడు ప్రకాశించేదై ఉంటుంది. ఇది అతని దివ్య స్వభావాన్ని వ్యక్తం చేస్తున్నది. తరువాత, భగవంతుని గుణాలు అన్నీ కళ్యాణమయాలు. అన్ని సమయాలలోనూ సత్వగుణం కొంచెం కూడా

మారకుండా ఉంటాయి. అందువల్లనే అతడు సదా కరుణ నిండినవాడై ఉంటాడు. భగవంతుని ఈ మూడు స్వభావాలను అళ్వార్లు ఈ ప్రబంధంలో వ్యక్తం చేశారు.

ఈ ప్రబంధం ప్రారంభంలో, ఆళ్వారులు, భగవంతుని తిరుమేని సౌందర్యాన్ని వర్ణించి. లోకంలో ఉండేవారిని రక్షించడం కోసం **"ఎటి కడల్ నడువుళ్ అరితుయల్ అమర్ న్దు"** (1) (కెరటాలు లేచే పాల సముద్రం మధ్యలో అరుదైన నిద్రలో అమరి ఉండి) అని, **"శివన్ అయన్ ఇందిరన్ ఇవర్ ముదల్ అనైత్తోర్ దెయ్ వక్కుழாఙ్గళ్ కై తొழு క్కిడంద తామరై వుంది తని ప్పెరు నాయక మూవులకళంద శేవడియోయే"** (1) శివుడు, బ్రహ్మ, ఇంద్రుడు అని మొదలుగా ఉండే దేవతా సంఘాలు అందరూ చేతులను జోడించి నమస్కరించగా, సృష్టికి మూల కారణమైన నాభీపద్మాన్ని కలిగిన అద్వితీయుడవైన ఓ స్వామీ! ముల్లోకాలను కొలిచిన అందమైన శ్రీపాదాలను కలిగినవాడా!) అని అంటూ భగవంతుని సంబోధించి, అందరూ ఇతనిని దర్శించి, అంజలిని ఘటించి సేవిస్తున్నందువల్ల ఇతడే పరదైవం అనే విషయాన్ని తెలియజేస్తూ, భగవానుని స్వరూపరూప గుణ విభూతులను **"తనిమాద్దెయ్ వ త్తడిమలరడిక్కీழ் ఇని నామ్ ఆళాకవే ఇశైయుంగొల్"** (4) విలక్షణదైవమైన ఈ స్వామి దాసుల శ్రీపాద పద్మాల కింద దాసులమై ఉండడానికి అంగీకరించండి) అని భగవంతుని భక్తులకు చేసే సేవయే పరమ పురుషార్థం, అదే భగవత్ప్రాప్తిని కలిగిస్తుంది – అనే విషయాన్ని, **"మాయక్కడవుళ్ మాముదలడియే"** (4) (ఆశ్చర్యకరమైన శక్తిని కలిగిన భగవానుని గొప్పదైన శ్రీచరణమే శరణం) **"ఊழிదోరూழி ఓవాదు వాழிయ వెన్ఱు యామ్ తొழு ఇశైయుజ్గొల్"** 4) (కల్పాల కల్పాల తరబడి నిరంతరంగా **"మంగళం! మంగళం!"** అని అంటూ మంగళాశాసనం చేస్తూ భగవానుని సేవించడానికి అంగీకరించండి) అని ప్రథమ పర్వం అయిన భగవంతుని విషయంలో మంగళాశాసనం, అతడు జగత్కారణంగాను జగద్రక్షకుడుగాను ఉండే గొప్పతనాలను గూర్చి పలికి, దేవతలను లోకాలను ప్రలయకాలంలో తన ఉదరంలో పెట్టుకొని రక్షించిన విషయాన్ని **"ఓర్ ఆలిలై చ్చేర్ న్ద ఎంబెరుమా మాయనై యల్లదు ఒరు మాదెయ్ వమ్ మற்றுడైయమో యామే"** (7) (లోకాలను అన్నిటినీ తన ఉదరంలో పెట్టుకుని, అద్వితీయమైన మర్రి చిగురుటాకులో శయనించిన స్వామి, ఆశ్చర్యకరమైన లీలలను కలవాడైనవానిని తప్ప, వేరొక ఏ గొప్ప దైవాన్ని మనం శరణంగా గలిగిన వారం కాము) అని లక్ష్మీనాథుడు తప్ప వేరు ఏ దైవం కూడా పరతత్వం కాదు, అతడే శరణ్యుడు – అని తెలియజేసి, అతనిని శరణంగా అశ్రయించమని ఉపదేశిస్తూ, ప్రబంధాన్ని పూర్తి చేసినందు వల్ల, ఈ ప్రబంధం లక్ష్మీనాథుని పరత్వాన్ని నిర్ణయం చేసే ప్రబంధమని భావింపబడుతున్నది.

యజుర్వేదం శ్రీమన్నారాయణునిగూర్చిన, అతనికి శరీర భూతులైన పలువురు దైవాలను గూర్చిన స్తుతిగాను, పలు యాగాల వివరాలను తెలియజేసేదిగాను ఉన్నది. దీని సారమైన ఈ తిరువాశిరియ ప్రబంధం కూడా, యాగాలన్నిటిచేత ఆరాధింపబడే పరదైవం శ్రీమన్నారాయణుడే – అని నిస్సందేహంగా తెలిపే గొప్పతనాన్ని కలిగి ఉన్నది.

## 3) పెరియ తిరువందాది

ఈ ప్రబంధంలోని అర్థవైలక్షణ్యాన్నిబట్టి ఇది పెరియ తిరువందాది అనే పేరును పొందింది – అని అని పెద్దలు అంటారు. అంటే, అర్థంలో చాలా గొప్పతనాన్ని కలిగినది – అని అర్థం. ఇంతే కాకుండా, ఈ ప్రబంధంలో ఆళ్వార్లు భగవంతుని ఉద్దేశించి. **"యాన్ పెరియన్ నీ పెరియై ఎన్బదనై యార్ అఱివార్?"** (75)– స్వామీ! నీవు పెద్దవాడవా?

నీ మహిమను సాకల్యంగా కీర్తించినందు వల్ల నేను పెద్దవాడనా? అనే విషయాన్ని ఎవరు తెలియగలరు? అని ప్రశ్నించినందు వల్ల కూడా దీనికి ఈ పేరు వచ్చిందని కూడా అంటారు..

ఇది అథర్వణవేద సారంగా భావింపబడుతున్నది. ఇయఱ్పా అనే మూడవ సహస్రంలో ఏడవ ప్రబంధంగా కూర్చబడింది. ఇం ఆళ్వారులు అందరిలో ప్రధానులుగా నమ్మాళ్వార్లు భావింపబడుతున్నారు. అందుచేత వారిని **"పెరియవర్"** వ్యవహరించడం సంప్రదాయం. వారు పాడిన ప్రబంధం కనుక, అందాదిక్రమంలోని ప్రబంధం కనుక, దీనికి పెరియ తిరువందాది అనే పేరు వచ్చిందని కూడా అంటారు.

ఈ ప్రబంధానికి భగవద్రామానుజులు అనుగ్రహించిన తనియన్ పాశురం ఉన్నది ఈ ప్రబంధాన్ని, పరమ కారుణికులు అని సంప్రదాయంలో ప్రసిద్ధులైన, శ్రీకృష్ణ సూరి అనే పేరును కలిగిన పెరియ వాచ్చాన్ పిళ్లై మణిప్రవాళ భాషలో వ్యాఖ్యానించారు. ఈ వ్యాఖ్యానానికి పెద్దలు కూర్చిన అరుంబదం ఉన్నది.

తిరువాశిరియ ప్రబంధంలో అళ్వార్లు తాము పొందిన మధురమైన భగవదనుభవం చేత దానిని ఇంకా ఇంకా అనుభవించాలి అనే ఆశ వారికి ఏర్పడి, అది మరింత మరింత అతిశయించగా ఆ ఆశను వారు ఈ ప్రబంధంలో వ్యక్తం చేస్తున్నారు. ఇందువల్ల, **"భగవంతుని అనుభవించాలి"** అనే ఆళ్వారుల మనసులో గల ఆశలోని గొప్పతనం, ఈ ప్రబంధాన్ని పాడిన ఆళ్వారుల గొప్పతనం, కీర్తింపబడిన భగవానుని గొప్పతనం – అనే ఈ అంశాలను ఉద్దేశించి ఈ ప్రబంధానికి పెరియ తిరువందాది అనే పేరు వచ్చిందనే వివరణను కూడా కొందరు చేశారు. ఈ ప్రబంధంలోని పాశురాలలో భాసించే శబ్దమాధుర్యం, అర్థగాంభీర్యం చాలా గొప్పవి.

ఈ ప్రబంధ ప్రారంభంలో అళ్వార్లు తమ మనసును ఉద్దేశించి సంబోధిస్తూ, ఈ విధంగా అంటున్నారు.

**"ముయఱ్ఱి శుమన్దెழున్ద మున్దుఱ్ఱ నెంజే!**
**ఇయఱ్ఱువాయ్ ఎమ్మొడు నీ కూడి – నయప్పుడైయ**
**నావీన్ తొడైక్కిళవి ఉళ్ పొదివోమ్, నఱ్పూవై**
**ప్పూవీన్ద వణ్ణన్ పుకழ்"**

(ఓ మనసా! నీవు ఒంటరిగా ఉండకు. మనం ఇద్దరం ఒకటిగా కలిసి, అగిసెపూవువర్ణం వంటి వర్ణాన్ని కలిగిన భగవానునికి కీర్తిని పాడుదాం రా.) అని తమ మనసును – భగవద్గుణానుభవంలో తమతో కలువమని ఆహ్వానించారు.

ప్రబంధం చివరిలో మనం మన పాపాలను లేకుండా చేసుకునే విషయాన్ని గూర్చి, భగవదనుభవంతో కాలక్షేపం చేసే విషయాన్ని గూర్చి తమ మనసుకు ఉపదేశించారు.

**"కార్ కలంద మేనియాన్ కై కలంద ఆழிయాన్**
**పార్ కలంద వల్ వయిఱ్ఱాన్ పాంబణైయాన్ – శీర్కలంద**
**శొల్ నినైందు పోక్కారేల్ శూழ்వినైయిన్ ఆழ் తుయరై**
**ఎన్ నినైందు పోక్కువరిప్పోదు? "**

(మనసా! మేఘంతో సమానమైన తిరుమేనిని కలవాడు, చేతిలో చక్రాయుధాన్ని ధరించినవాడు, సమస్త జగత్తులను తన బలిష్ఠమైన ఉదరంలో ధరించినవాడైన శేషశాయియొక్క కళ్యాణ గుణాలతో నిండిన సూక్తులను అనుసంధానం చేసుకుంటూ, అనాదిగా మనలను చుట్టుకుని ఉండే పాపాలను పోగొట్టుకోకపోతే, ఇక దేనిని భావించి పాపాలను పోగొట్టుకోగలం?)

**"ఎప్పోదుమ్ కైకఴిలా నేమియాన్ నమ్మేల్ వినై కడివాన్**

**మొయ్ కఴలే ఏత్త ముయల్"**

(మనసా! ఎల్లప్పుడూ తన చేతిలో పరిభ్రమించే సుదర్శనాన్ని కలవాడైన భగవానుడే మన పాపాలను పోగొడతాడు. ఆ స్వామి శ్రీపాదాలనే ఆశ్రయించడానికి ప్రయత్నం చేయి)

అని అంటూ భగవంతుడైన శ్రీమన్నారాయణుడే ఉపాయం అని, ఆ స్వామి కళ్యాణ గుణాల అనుభవమే ఉపేయమని ఉపదేశించారు.

ఇక్కడ **"కార్ కలంద"** ఇత్యాది పాశురంలో ధ్వనించే ఒక మధురమైన విషయాన్ని పెద్దలు అందంగా వ్యాఖ్యానించారు.

**"కార్ కలంద మేనియాన్"** అనే పదం – మేఘంతో సమానమైన దివ్య మంగళ విగ్రహాన్ని కలిగిన శ్రీరాముని తెలుపుతుంది.. అతని కళ్యాణ గుణాలను అనుసంధానం చేయడం అంటే, వాటిని కీర్తించే శ్రీరామాయణంతో కాలక్షేపం చేయడమే. **"కై కలంద ఆఴియాన్"** అనే ప్రయోగం, దుష్ట సంహారం కోసం పలుమార్లు తమ చేతిలో సుదర్శన చక్రాన్ని ధరించిన శ్రీకృష్ణుని తెలుపుతుంది. ఆ స్వామి కళ్యాణ గుణాలను అనుసంధించడం అంటే, ఆ అవతార వైభవాన్ని తెలిపే మహాభారతార్థానుసంధానాన్ని కాలక్షేపంగా కలిగి ఉండడమే. **"పార్ కలంద వల్ వయిற்றான்"** అంటే తన ఉదరంలో సమస్తలోకాలను పెట్టుకుని రక్షించిన వటపత్రశాయి. ఆ స్వామి కళ్యాణ గుణాలను అనుసంధించడం అంటే, ఆ స్వామి చరిత్రలను, అవతారగాథలను అందంగా వర్ణించే భాగవత కథానుసంధానాన్ని చేయడమే. ఇక చివరిగా, **"పాంబణైయాన్"** అంటే, శ్రీరంగంలో ఆదిశేషుని పైన శయనించి ఉండే శ్రీరంగనాథుడు. ఆ స్వామి కళ్యాణ గుణాలను అనుసంధించడం అంటే, వాటిని కీర్తించే నమ్మాళ్వారుల తిరువాయ్ మొళి ప్రబంధంతో కాలక్షేపం చేయడమే.

ఈ విధంగా ఈ పాశురంలో నమ్మాళ్వారులు ఉభయ వేదాంత సంప్రదాయక్రమాన్ని తెలుపుతూ, దానితో భగవద్గుణానుసంధానాన్ని చేయమని ఈ ప్రబంధంలో ఉపదేశిస్తున్నారని పెద్దలు వ్యాఖ్యానించారు.

ఇటువంటి అందమైన ఎన్నో భావాలతో, సంప్రదాయార్థాలతో, వేదాంతతత్వాలతో నిండినది, ఈ ప్రబంధం.

ఇప్పుడు ఆళ్వారుల చివరి ప్రబంధమైన తిరువాయ్ మొళిని గమనిద్దాం.

## 4) తిరువాయ్ మొళి

ఈ ప్రబంధం నమ్మాళ్వారుల చివరి ప్రబంధం. ఇది సామవేద సారంగా సంభావింపబడుతున్నది. ఇది 10 శతకాలను, నూరు దశకాలను, 1102 పాశురాలను కలిగినదై, మండల అందాది క్రమంలో భాసిల్లుతున్నది. సామవేదానికి సంబంధించిన ఉపనిషత్తు అయిన ఛాందోగ్యానికి సారంగా కూడా దీనిని పెద్దలు భావించారు. ఇంకేం కాకుండా ఇది ద్వయ మంత్రసారమని, శారీరక మీమాంసా శాస్త్ర రూపమని, శ్రీరామాయణం వలె దీర్ఘ శరణాగతి ప్రబంధమని కూడా మన పూర్వాచార్యులు కొనియాడారు. తమ వ్యాఖ్యానాలలో ఈ విషయాలను సప్రమాణంగా నిరూపించారు కూడా.

ఈ ప్రబంధానికి పూర్వాచార్యులు కూర్చిన ఐదు వాఖ్యానాలు ప్రసిద్ధంగా ఉన్నాయి. కురుకేశ్వరులు అని, తిరుక్కురుగై ప్పిరాన్ పిళ్ళాన్ అని సంప్రదాయంలలో వ్యవహరింపబడే ఆచార్యులు రచించిన 6వేల గ్రంథ పరిమితిలో ఆఱాయిరప్పడి అనే వ్యాఖ్యానం, (గ్రంథం అంటే, 32 అక్షరాల పరిమితి) నంజీయర్ అనే ఆచార్యులు రచించిన,

తొమ్మిది వేల గ్రంథ పరిమితిలోని ఒన్బదినాయిర ప్పడి వ్యాఖ్యానం, శ్రీకృష్ణ సూరి అని, పెరియ వాచ్చాన్ పిళ్ళై అనే ప్రసిద్ధులైన ఆచార్యులు రచించిన, 24 వేల గ్రంథ పరిమితిలోని ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యానం, అళగియ మణవాళ చ్ఛీయర్ అనే ఆచార్యులు రచించిన, 12వేల గ్రంథ పరిమితిలోని పన్నీరాయిరప్పడి వ్యాఖ్యానం, నంబిళ్ళై అనే ఆచార్యులు రచించిన, 36వేల గ్రంథ పరిమితిలోని ఈడు ముప్పత్తాఱాయిరప్పడి వ్యాఖ్యానం అనేవి ఈ ఐదు వ్యాఖ్యానాలు. ఇవే కాకుండా, వడగలై సంప్రదాయానికి సంబంధించిన ఒన్బదినాయిరప్పడి, పదినెణ్ణాయిరప్పడి, ఇరుపత్తు నాలాయిరప్పడి శబ్దార్థం అనే వ్యాఖ్యానాలు కూడా ఉన్నాయి. ఈడు వ్యాఖ్యానానికి రెండు అరుంబద వివరణలు ఉన్నాయి. తిరువాయ్ మొళి ప్రబంధంలోని దశాకాల సారాలను తెలియజేస్తూ వేదాంతదేశికులు అనే ఆచార్యులు ద్రవిడోపనిషత్ తాత్పర్య రత్నావళి, ద్రవిడోపనిషత్ సారం అనే రెండు సంస్కృత శ్లోక రూపమైన కృతులను రచించారు. అళగియ మణవాళ చ్ఛీయర్ ద్రవిడోపనిషత్ సంగతి అనే సంస్కృత కృతిని వేరొకటిని రచించారు శ్రీమద్వరవరమునులు ద్రావిడ భాషలో తిరువాయ్ మొళి నూత్తందాది అనే ప్రబంధాన్ని రచించారు. తిరువాయ్ మొళి ప్రబంధంలోని మొదటి రెండు దశకాలు శారీరక మీమాంసా శాస్త్రానికి సంగ్రహరూపమనే విషయాన్ని ప్రమాణంగా నిరూపిస్తూ పెరుమాళ్ కోయిల్ అழగియ మణవాళ చ్ఛీయర్ అనేవారు అనుగ్రహించిన శ్రీభాష్యద్రమిడాగమైకకంఠ్యం అనే కృతిని మణిప్రవాళభాషలో రచించారు. ఈ ప్రబంధంలోని అర్థ విశేషాలను వివరిస్తూ పిళ్లై లోకాచార్యులవారు సారసంగ్రహం అనే కృతిని, అళగియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ అనే ఆచార్యులు ఆచార్య హృదయం అనే ద్రావిడకృతిని రచించారు. ఈ విధంగా ఈ ప్రబంధాన్ని ఉద్దేశించి పలువురు పూర్వాచార్యులు ఎన్నో కృతులను వెలువరించారు. ద్రావిడ సాహిత్యంలో గొప్ప కవిగా పేరు పొందిన కంబమహాకవి నమ్మాళ్వారుల, వారు అనుగ్రహించిన తిరువాయ్ మొళి ప్రబంధం యొక్క వైభవాన్ని కీర్తిస్తూ **"శడగోపర్ అందాది"** అనే ద్రావిడ ప్రబంధాన్ని అద్భుతంగా రచించాడు.

ఈ ప్రబంధానికి నాథమునులు అనుగ్రహించిన ఒక సంస్కృత శ్లోకం, ఈశ్వర ముని, శొట్టైనంబి, అనందాళ్వాన్, పరాశర భట్టర్ అనే నలుగురు అనుగ్రహించిన నాలుగు ద్రావిడ పాశురాలు తనియన్ లుగా ఉన్నాయి.

నాథమునులు తమ తనియన్ శ్లోకంలో ఈ ప్రబంధాన్ని ద్రావిడ వేదసాగరంగా అభివర్ణిస్తూ ఈ విధంగా అన్నారు.

**"భక్తామృతం విశ్వజనానుమోదనం సర్వార్థదం శ్రీ శఠకోపవాఙ్మయమ్,**
**సహస్రశాఖోపనిషత్ సమాగమం నమామ్యహం ద్రావిడ వేద సాగరమ్"**

సముద్రం దేవతలకు అమృతాన్ని అందించింది. ఈ ప్రబంధం కూడా భక్తులకు అమృతం వంటి అర్థాలను అందిస్తున్నది. సముద్రాన్ని లోకంలో ఉండే వారందరూ చూసి ఆనందిస్తారు. తిరువాయ్ మొళి ప్రబంధాన్ని చూచి సహృదయులైన ఆస్తికులు అందరూ ఆనందిస్తారు. సముద్రంలో విలువైన వస్తువులు అన్నీ లభిస్తాయి. ఈ ప్రబంధంలో కూడా ఎన్నో విలువైన వేదాంత తత్వాలు లభిస్తాయి. సముద్రం అగస్త్యముని నోటి నుండి వెలువడింది. ఈ వృత్తాంతం పురాణ ప్రసిద్ధం. తిరువాయ్ మొళి ప్రబంధం కూడా శఠకోపముని ముఖంనుండి వెలువడింది. సముద్రం పలు నదులను, కొండవాగులను తనలో కలిగి ఉంటుంది. ఈ ప్రబంధం కూడా వేయి ఉపనిషత్ శాఖలతో కూడిన సామవేద సారమై ఉన్నది. ఈ విధంగా ఈ ప్రబంధం అన్ని విధాల సాగర సమానమని శ్రీమన్నాథమునులు కీర్తించారు.

మిగిలిన ఆళ్వారులు అందరూ అనుగ్రహించిన దివ్య ప్రబంధాల కంటే, నమ్మాళ్వారులు అనుగ్రహించిన మిగిలిన మూడు దివ్య ప్రబంధాల కంటే కూడా, ఈ తిరువాయ్ మొళి దివ్య ప్రబంధం చాలా ముఖ్యమైనది. శ్రీకృష్ణుడు గీతలో **"శ్రుతిస్మృతీ**

**మమైవాజ్ఞా"** (వేదాలు స్మృతులు అనేవి నా ఆజ్ఞా రూపాలే) – అని అన్నాడు అందువల్ల, వేదం భగవానుని ఆజ్ఞారూపం అని, ఎటువంటి మార్పు లేనిది అనే గొప్పతనాన్ని పొందింది.

ఇదే విధంగా 1102 పాశురాలను కలిగిన ఈ తిరువాయ్ మొళి ప్రబంధం కూడా **"ఆణై ఆయిరమ్, పొయ్యిల్ పాడల్, ఏదమిల్ ఆయిరమ్, ముందై ఆయిరమ్, అழிవిల్లా ఆయిరమ్"** (భగవానుని ఆజ్ఞారూపమైన వేయి పాశురాలు, అసత్యం లేని వేయి పాశురాలు, ఏ దోషం లేని వేయి పాశురాలు, అనాది అయిన వేయి పాశురాలు నాశం లేని వేయి పాశురాలు) కీర్తింపబడే గొప్పతనాన్ని కలిగినది అనాది అయిన వేదాలను నారాయణుడు చతుర్ముఖునకు ఉపదేశించి, వెలువరించాడు. ఆ విధంగానే నిత్యమైన, ద్రావిడ వేద రూపమైన ఈ ప్రబంధాన్ని భగవానుడు ఆళ్వారులకు ఉపదేశించగా, అందువల్ల ఆళ్వార్లు దీనిని అనుగ్రహించారు –అని సంప్రదాయంలో విశ్వాసం.

ఋగ్వేదం స్వరవివరణమై, గానరూపమైన సామవేదంగా విస్తరించింది. ఆ విధంగానే, ఋగ్వేదసారమైన తిరువిరుత్త ప్రబంధం స్వరంతో కూడినదై, ఈ తిరువాయ్ మొళి ప్రబంధం అనే సామవేద సారంగా అయినది. ఈ ప్రబంధంలోని ఒక్కొక్క పాశురం భగవంతుని వైభవాన్ని కీర్తిస్తున్నది. ఆళ్వారులు తమ జ్ఞాననేత్రాలతో భగవంతుని దర్శించి అనుభవించి ఆనందించారు. ఆ ఆనందానుభవం వల్ల, అప్రయత్నంగానే ఈ ప్రబంధం భగవంతుని పాదాలలో సమర్పించిన వాఙ్మాలగా అవతరించినది – అని భావించడం చాలా యుక్తమైనది అని పెద్దలు అంటారు. **"అరుళ్ కొండు ఆయిరమ్ ఇన్ తమిழ் పాడినాన్"** (పరమ కృపతో వేయి, తీయని ద్రావిడ పాశురాలను నమ్మళ్వార్లు పాడారు) అని మధురకవులు అంటారు. అంటే, **"ఈ లోకంలో ఉండేవారు అందరూ భగవంతుని ఉపాయంగా ఆశ్రయించి తరించాలి"** అనే గొప్ప ఆశతో అళ్వార్లు 1102 పాశురాలను కలిగిన ఈ తిరువాయ్ మొళి ప్రబంధాన్ని అనుగ్రహించారు – అని దీని భావం.

**"ఎన్నెంజత్తు ఉళ్ ఇరుందు ఇంగిరుందు తమిழ் నూలివై మొழிన్దు"** (భగవానుడు నా మనస్సులో అధివసించి ఉండి, ద్రావిడ శాస్త్రరూపమైన ఈ గ్రంథాన్ని నా చేత పలికించి) అని **"పణ్ణార్ పాడల్ ఇన్ కవిగళ్ యానాయ్ తన్నై త్తాన్ పాడి"** (రాగాలతో నిండిన పాశుర రూపాలైన ఈ ప్రబంధం ద్వారా భగవానుడు తననే తాను కీర్తించుకొని) అనే విధంగా, భగవంతుడే తమ మనసులో ఉండి, ఈ పాశురాలను పాడించాడు – అని ఆళ్వారులే స్వయంగా పలికారు. ఈ సూక్తులు అన్నీ ఈ ప్రబంధం వేద సమానమనే విషయాన్ని సూచిస్తున్నాయి.

భగవంతుని నిర్హేతుక కరుణ వల్ల ఆళ్వార్లు తాము పొందిన అనుభవాన్ని, ఆనందాన్ని ఈ తిరువాయ్ మొళి ప్రబంధంలోని ఒక్కొక్క దశకంలోనూ వివరించారు. ప్రబంధంలోని ఒక్కొక్క శతకం భగవంతుని ఒక్కొక్క కల్యాణ విశేషాన్ని వర్ణిస్తున్నది – అని నాయనార్ అనే ఆచార్యులు తమ ఆచార్య హృదయం అనే గ్రంథంలో సోదాహరణంగా నిరూపించారు. అవి, వరుసగా, పరత్వం కారణత్వం, వ్యాపకత్వం, నియంతృత్వం, కారుణికత్వం, శరణ్యత్వం, శక్తత్వం, సత్యకామత్వం, ఆప్తసఖత్వం, ఆర్తిహరత్వం అనేవి. ఈ విధమైన వివరణం శారీరకమీమాంసా దృష్టితో చేయబడింది. ఎందుకంటే, ఆ శాస్త్రంలోని నాలుగు అధ్యాయాలలో ఉండే 16 పాదాలు భగవంతుని స్రష్టృత్వం మొదలైన 16 గుణాలు చెప్పబడ్డాయని ఆచార్యులు అభిప్రాయపడ్డారు.

మిగిలిన అందరూ ఆళ్వార్లు అవయవాలుగా కలిగిన అంగి భూతులైన నమ్మాళ్వార్లు అనుగ్రహించిన ఈ తిరువాయ్ మొళి ప్రబంధం, భగవద్గీతలో భగవానుడు **"వేదానాం సామవేదో స్మి"** అని పలికిన రీతిలో భగవత్ స్వరూపమైన సామవేదానికి సారంగా చెప్పబడుతున్నందున, మిగిలిన వీరి మూడు ప్రబంధాలు, ఆ విధంగానే మిగిలిన

ఆళ్వారులు అనుగ్రహించిన అన్ని ప్రబంధాలు అంగప్రబంధాలుగాను, ఈ ప్రబంధం అంగిప్రబంధంగాను సంప్రదాయంలో సంభావింపబడుతున్నది.

భగవంతుని స్వరూపం, చేతనుని స్వరూపం, భగవత్ ప్రాప్తి అనే ఫలస్వరూపం, దానికి ఉపాయమైన భక్తి స్వరూపం, దానికి ఏర్పడే విరోధుల స్వరూపం –అనే ఈ ఐదు విధాలైన విషయాలను అంతర్భవించుకున్నవి, సకల వేద శాస్త్రాలు. వాటి సంగ్రహమే మంత్రరత్నం అనబడే ద్వయ మంత్రం. అది రెండు ఖండాలుగా ఉన్నది. దాని వివరణమే ఈ ప్రబంధం. అందువల్ల ఇది సకల వేదశాస్త్రసారం.

ఇపుడు, ఈ తిరువాయ్ మొళి ప్రబంధం ద్వయమంత్ర వివరణాత్మకమైనది అనే విషయం క్లుప్తంగా ప్రస్తావించబడుతున్నది.

ఇందులోని మొదటి శతకంలో – **"మలర్ మగళ్ విరుంబుమ్ నమ్ అరుమ్ పెఱులడిగళ్"** (1–3–1) లక్ష్మీదేవి ఆశపడే మన దుర్లభుడయిన స్వామి), **"మలరాళ్ మైందన్"** ( (లక్ష్మీ నాథుడు), **"తిరుమామగళార్ తనిక్కేళ్వన్"** (1–6–9) (లక్ష్మీదేవికి వల్లభుడు), **"తిరువిన్మణాళన్"** (1–9–1) (లక్ష్మీ వల్లభుడు), **"మలరాళ్ మణవాళన్"** (1–10–4) (లక్ష్మీ నాథుడు) అని మొదలైన ప్రయోగాలతో ద్వయ మంత్రంలో పూర్వకండలో ఉండే **"శ్రీమత్"**అనే శబ్దం ద్వారా తెలుపబడే భగవానుని శ్రియఃపతిత్వం తెలుపబడింది. రెండవ శతకంలో – **"ఎంబెరుమాన్ నారణన్"** (2–1–7) (మనకు స్వామి అయిన నారాయణుడు), **"నారణన్ ముழு వేழுలకుక్కుమ్ నాదన్"** ( (2–7–2) (నారాయణుడు, మూడు లోకాలకు అన్నిటికీ ప్రభువు) అని మొదలైన ప్రయోగాల ద్వారా ద్వయమంత్రం పూర్వవాక్యంలో ఉండే **"నారాయణ"** పదంలోని అర్థం వివరింపబడింది. మూడవ శతకంలో – **"అంగదిరడియన్"** (3–4–3) (అందమైన, సూర్యునివలె ఉజ్జ్వలమైన శ్రీచరణాలను కలవాడు), **"మూవులగుమ్ తొழுదేత్తుమ్ శీరడియాన్"** (3–8–1) (ముల్లోకాలు నమస్కరించి కీర్తించే, కళ్యాణ గుణాలను గల శ్రీచరణాలను కలవాడు)అని మొదలైన ప్రయోగాల ద్వారా పూర్వవాక్యంలో ఉండే మూడవ పదమైన **"చరణౌ"** అనే శబ్దంలోని అర్థం అనుసంధింపబడింది. నాల్గవ శతకంలో – వల్వినై తీర్ క్కుమ్ కణ్ణన్" (4–4–11) (ప్రబలపాపాలను పోగొట్టే శ్రీకృష్ణుడు), **"వెయ్యు నోయ్ గళ్ ముழுదుమ్ వియన్ ఞాలత్తు వీయవే"** విశాలమైన ఈ భూమిలో ఉండగానే ఘోరమైన పాపాలు అన్ని తీరేటట్లుగా (4–5–2), **"పిఱందుమ్ శற்றுమ్ నిన్ఱిడరుమ్ పేదమై తీర్ న్దొழிన్దేన్"** (4–7–7) (పుట్టడం, మరణించడం అనే వీటి వల్ల పడే అజ్ఞాన సంస్కార బాధను తొలగించుకొన్నాను) **"వేట్కై ఎల్లామ్ విడువిత్తు"** (4–9–9) (విషయాంతర వాంఛల నుండి విడిపించి) అని మొదలైన ప్రయోగాలతో నాల్గవ పదమైన **"శరణం"** అనే పదంలోని, అర్థమైన ఇష్ట ప్రాప్తి, అనిష్ట నివృత్తులకు కారణమై ఉండే ఆ స్వామిని ఆశ్రయించడం తెలుపబడింది. ఐదవ శతకంలో **"తమియేనుక్కరుళాయ్"** (5–7–2), (ఒంటరిగా ఉండే నాకు అనుగ్రహాన్ని కలిగించు), **"ఉన్నాలల్లాల్ యావరాలుమ్ ఒన్ఱుమ్ కుఱై వేండేన్"** (5–8–3) (నీ వల్ల తప్ప వేరొకరి ఎవరివల్ల నేను నా మనోరథాన్ని తీర్చుకోవాలని కోరను), **"నామంగళ్ ఆయిరముడైయ నంబెరుమాన్ అడిమేల్ శేమమ్ కొళ్ తెన్కురుగూర్ శడగోపన్"** (5–9–11) (వేయి నామాలను కలిగిన భగవంతుని శ్రీపాదాలలో సడలని విశ్వాసాన్ని కలిగిన, దక్షిణ దిక్కులో ఉండే అందమైన తిరుక్కురుగూర్ దివ్య దేశంలో ఉండే నమ్మాళ్వార్లు) **"నాగణై మిశై నంబిరాన్ శరణే శరణ్ నమక్కు ఎన్ఱు నాడొఱుమ్ ఏకశిందైయానాయ్"** (5–10–11) (ఆదిశేష శయనుడైన భగవంతుని శ్రీచరణాలే నాకు శరణం – అని ఎల్లప్పుడూ స్థిరమైన అధ్యవసాయాన్ని కలిగినవారై)అనిమొదలైన ప్రయోగాల ద్వారా పూర్వవాక్యంలో ఐదవ పదమైన **"ప్రపద్యే"** అనే పదంలోని అర్థాన్ని తెలియజేయడం జరిగింది.

ఇక, ఆరవ శతకంలో – **"అడిమై శెయ్ వార్ తిరుమాలుక్కే"**, (6–5–11) (లక్ష్మీ నాథునకే సేవను చేస్తారు), **"ఎన్ తిరు మార్బుక్కు!"** ( (6–8–10) (వక్షసులో లక్ష్మిని కలిగినవానికి), **"కోల త్తిరుమామగళోడు ఉన్నై"**, (అందమైన లక్ష్మీదేవితో పాటు నిన్ను), **"ఒశింద ఒణ్ మలరాళ్ కొழுనన్"** (6–7–8) (నాథునితో పొందిన భోగం చేత కృశమైన దేహాన్ని కలిగిన లక్ష్మీకి వల్లభుడు) అని మొదలైన సూక్తులతో ద్వయమంత్రంలోని ఉత్తరఖండంలో మొదటి పదమైన **"శ్రీమత్"** అనే పదంలో తెలియబడే, భగవంతుని లక్ష్మీదేవితో నిత్య సంబంధం వివరింపబడింది. ఏడవ శతకంలో –"కన్నలే! అముదే!" (7–1– 2) (కలకండ వలె, అమృతం వలె భోగ్యమైనవాడా!), **"ఏழுలగు ఇన్బమ్ పయక్క"** (7–10–1) (ఏడు లోకాలు ఆనందాన్ని పొందగా)? అని మొదలైన ప్రయోగాల ద్వారా రెండవ వాక్యంలోని రెండవ పదం అయిన **"నార"** అనే శబ్దంలోని అంతరార్థమైన కైంకర్యాన్ని పొందడానికి కారణమైన భగవంతుని నిరూపమానమైన యోగ్యతను తెలియజేయడం జరిగింది. ఎనిమిదవ శతకంలో – **"అడియేన్ పెరియ వమ్మాన్"** (8–1–3) (దాసుడైన నా విషయంలో ప్రేమను అంతటినీ చూపించినవాడా!) **"ఆమర్ న్ద నాదనై"** (8–4–10) (యోగ్యమైన నాథత్వాన్ని కలిగినవానిని), **"మూవులగాళి"** (8–9–5) (ముల్లోకాలను పాలించేవాడు) అని మొదలైన పదప్రయోగాల ద్వారా మూడవ పదం అయిన **"అయన"** శబ్దానికి తగిన సర్వేశ్వరత్వం అనే భగవంతుని స్వభావం తెలుపబడింది. తొమ్మిదవ శతకంలో – **"నిన్బీర్ న్ద వడిమై క్కుற్றేవల్"** (9–2–2) (విషయాలలో రుచిని పోగొట్టిన నీకు అంతరంగా సేవను చేసి) **"తొడర్ న్దు కుற్றేవల్ శెయ్ దు"** (9–2–3) (నిరంతరంగా అంతరంగ సేవను చేసి) **"కొడు మా వినైయేనుమ్ పిడిక్క"** (9–2–10) (మహా పాపాలను చేసిన నేను కూడా సంవాహనం చేయగా) అని మొదలయిన ప్రయోగాల ద్వారా నాలుగవ పదం అయిన **"ఆయ"** అనే శబ్దంలోని తాత్పర్యం అయిన నిత్య కైంకర్యం తెలియజేయబడింది. చివరిగా, పదవ శతకంలో – **"తుయర్ కెడుమ్"** (10–1–8) (దుఃఖాన్ని తీర్చే), **"ఇప్పిఱప్పు అఱుక్కుమ్"** (ఈ జన్మను నశింపచేసే), **"పిఱవి త్తుయర్ కడిందోమ్"** (జన్మ వల్ల కలిగిన క్లేశాన్ని పోగొట్టుకున్నాము), **"పిఱవి క్కెడుత్తేన్"** (10–8–3) (జన్మవల్ల కలిగిన క్లేశాన్ని లేకుండా చేసుకున్నాను) **"అవా వற்று వీడు పెற்ற"** (10–10–11) (ఆశ తీరి ముక్తిని పొందిన) అని మొదలైన ప్రయోగాల ద్వారా ఐదవ పదం అయిన **"నమః"** ఈ పదంలోని అర్థమైన విరోధులను సమూలంగా నశింప చేయడం అనే అర్థం ఉపదేశింపబడింది. ఈ విధంగా ఈ ప్రబంధం పూర్తిగా ద్వయమంత్రానికి వివరణ రూపమై విలసిల్లుతున్నది. ఈ వివరణ ద్వయ మంత్రంలో ఉండే 10 పదాలకు ఈ ప్రబంధంలో ఉండే 10 శతకాలు వివరణ రూపాలు – అనే క్రమాన్ని అనుసరించి చేయబడింది. ఇది అంతా వివరణ సాపేక్షమైనది కనుక, క్లుప్తంగా మాత్రమే ఇక్కడ ప్రస్తావించబడింది.

ఈ ప్రబంధం ద్వయవివరణాత్మకమనే విషయాన్ని నంబిళ్ళై అనే ఆచార్యులు వ్యాఖ్యానంలో వేరు విధంగా సమన్వయించారు. ఇందులో ఉండే మొదటి మూడు శతకాలు ద్వయ మంత్రంలో ఉండే ఉత్తర వాక్యంలోని అర్థాన్ని తెలుపుతున్నవి – అని, తరువాత మూడు శతకాలు ద్వయ మంత్రంలోని పూర్వవాక్యంలో తెలియబడే అర్థాన్ని వివరిస్తున్నవి – అని, మిగిలిన నాలుగు శతకాలు వీటికి వివరణ రూపాలని వారు వివరించారు. ఈ విధంగా సక్రమంగా కాకుండా, వ్యుత్క్రమంలో ఈ ప్రబంధం ద్వయమంత్రాన్ని వివరిస్తున్నది – అనే సమన్వయం ఈ ప్రబంధం వైదికమైన క్రమంలో, పరోపదేశాత్మకమైనది – అనే దృష్టిలో చేయబడింది. ఎందుకంటే, వేదంలో కూడా, " స్వర్గకామః జ్యోతిష్టోమేన యజేత " (స్వర్గ ప్రాప్తిని కోరేవాడు జ్యోతిష్టోము యాగాన్ని చేయాలి) అని అంటూ ముందుగా స్వర్గ ప్రాప్తి అనే ఫలస్వరూప నిర్దేశాన్ని చేసి, ఆ తరువాత ఆ ఫలాన్నికి పొందడానికి తగిన ఉపాయమైన జ్యోతిష్టోమ

యాగాన్ని విధించింది. వేదప్రతిరూపమైన ఈ ప్రబంధం కూడా, అదే క్రమంలో, ముందుగా మొదటి మూడు శతకాలలో ఫలస్వరూపాన్ని, ఆ తరువాత మూడు శతకాలలో ఆ ఫలానికి తగిన ఉపాయాన్ని తెలిపింది – అని పూర్వాచార్యుల సమన్వయం.

ప్రతిపాద్య విషయప్రతిపాదనను ఈ ప్రబంధం వేదక్రమంలో చేస్తున్నది అనే అంశాన్ని వేరొక ఉదాహరణ ద్వారా ఇప్పుడు గమనిద్దాం. వేదం జగత్కారణ రూపమైన పరతత్త్వాన్ని గూర్చి **"సదేవ సౌమ్య! ఇదమగ్ర ఆసీత్"** (సౌమ్యుడా! సృష్టికి ముందు సత్ అనబడే వస్తువే ఉన్నది), **"అసద్వా ఇదమగ్ర ఆసీత్"** (సృష్టికి ముందు అసత్తు అని చెప్పబడే వస్తువే ఉన్నది), **"బ్రహ్మ వా ఇదమగ్ర ఆసిత్"** (సృష్టికి ముందు బ్రహ్మ శబ్దంచేత చెప్పబడే తత్త్వమే ఉన్నది) **"న సన్నచాసత్, శివ ఏవ కేవలః"** (సృష్టికి ముందు సత్తు లేదు, అసత్తు లేదు, శివుడు ఒక్కడే ఉన్నాడు) అని అంటూ పలుచోట్ల పలు పదాలతో నిర్దేశించి పలికింది. ఈ పదాలన్నీ ఇదమిత్థంగా ఏ దేవతను పరతత్త్వమని నిర్దేశించి తెలిపే పదాలు కావు. వీటిని అన్నిటిని సర్వశాఖాప్రత్యయ న్యాయంలో సమన్వయం చేసుకొని, నారాయణుడే జగత్కారణ తత్త్వమని నిర్ణయించుకోవడానికి వీలుగా మహోపనిషత్తు **"ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మ, నేశానః"** (సృష్టి ప్రారంభంలో నారాయణుడు ఒక్కడే ఉన్నాడు, బ్రహ్మ గాని, ఈశ్వరుడు కాని లేడు) అంటూ చాలా స్పష్టంగా సృష్టి ఆరంభంలో ఉన్న తత్త్వం నారాయణుడే అని, బ్రహ్మ, శివుడు కాడని తెలియజేసింది. ఆ తరువాత, వేరొక వాక్యంలో ఆ నారాయణుడు కేవల నారాయణుడు కాదని, అతడు లక్ష్మీవిశిష్టుడు – అనే విషయాన్ని **"సర్వే నిమిషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి"** (నిమేషరూపంలోని కాలతత్త్వం అంతా విద్యుద్వర్ణుడైన పురుషుని వల్ల ఉద్భవించింది) అని తెలియజేసింది. ఇక్కడ విద్యుద్వర్ణాన్ని కలిగిన పురుషుడు అంటే, విద్యుద్వర్ణ అయిన లక్ష్మితో సంబంధం కలిగిన నారాయణుడే. ఈ విధంగా వేరు వేరు సందర్భాలలోని వేరు వేరు వాక్యాల ద్వారా, వేదం, జగత్కారణ తత్త్వం శ్రీమన్నారాయణుడే అని, అతడే పరతత్త్వం అని తెలిపింది.

ఇదే క్రమంలో, నమ్మాళ్వారులుకూడా, ఈ తిరువాయ్ మొళి ప్రబంధంలో **"ఉయర్వఱ"** అనే మొదటి దశకంలో సమస్త చేతనా చేతనాలకు సత్తాస్థితిప్రవృత్తినివృత్తికారణభూతుడైన, సర్వవ్యాపకుడైన పరమాత్మను తెలియజేసి, అటువంటి పరతత్త్వాన్ని ఆశ్రయించమని తమ మనసుకు ఉపదేశించారు. **"వీడుమిన్"** రెండవ దశకంలో ఆ పరతత్త్వం నారాయణుడు అనే విషయాన్ని, అతనిని ఆశ్రయించమని తెలుపుతూ **"వణ్ పుకழ் నారణన్ తిణ్ కழల్ శేరే"** (1–2–10) (గొప్ప కళ్యాణగుణాలను కలిగిన నారాయణుని దృఢమైన శ్రీపాదాలను ఆశ్రయించండి) అని అన్నారు. **"పత్తుడై"** మూడవ దశకంలో ఆ నారాయణుడు లక్ష్మీసహితుడు అనే విషయాన్ని **"తిరువుడై యడికళ్ తమ్ నలమ్ కழల్ వణంగి"** (లక్ష్మీసహితుడైన ఆ స్వామియొక్క కళ్యాణగుణాలను కలిగిన శ్రీపాదాలకు నమస్కరించి) (1–3–8) అని అంటూ స్పష్టం చేశారు. ఈ క్రమం పైన ప్రస్తావించిన వేదక్రమాన్ని అనుసరిస్తున్నది – అనే అంశం స్పష్టమవుతున్నది కదా.

ఈ ప్రబంధంలోని మొట్టమొదటి పాశురం ఈ ప్రబంధానికి సంగ్రహరూపమని కూడా విజ్ఞులు భావించారు. మొదటి పాశురం ఈ విధంగా ఉన్నది.

**"ఉయర్వఱ ఉయర్ నలమ్ ఉడైయవన్ యవనవన్,**
**మయర్వఱ మదినలమ్ అరుళినన్ యవనవన్,**

**అయర్వుఱు మమరర్ గళ్ అదిపతి యవనవన్**

**తుయరఱు శుడరడి తొ(ழு)దు ఎన్ మననే!"**

సాటి మేటి లేని, సహజమైన కళ్యాణ గుణాలను కలిగినవాడు, భక్తిరూపాపన్న జ్ఞానాన్ని అనుగ్రహించేవాడు ఏ విధమైన జ్ఞాన సంకోచం లేని నిత్యసూరులకు నాథుడు అయిన భగవంతుని, భక్తుల దుకాలను తీర్చే శ్రీచరణాలను, ఓ మనసా! ఆశ్రయించు.

ఈ పాశురంలో భగవద్రామానుజ సిద్ధాంతానికి అనుగుణంగా అర్థపంచకం వివరింపబడిందని ఆచార్యుల వివరణం. భగవానుడు సహజమైన సమస్త కళ్యాణ గుణాలను కలిగినవాడు, ఉభయ విభూతి నాథుడు, దివ్య మంగళ విగ్రహ సముపేతుడు, నిర్హేతుక కరుణను కలవాడు, భక్తుల ఆర్తిని తీర్చే స్వభావాన్ని కలవాడు– అని ఈ విధంగా పరస్వరూపం, ఆ స్వామికి శేషభూతుడై అతనిని ఆశ్రయించి సేవించడమనే జీవుని స్వరూపం – అనే జీవస్వరూపం, జీవుడు తరించటానికి ఆ భగవానుని శ్రీచరణాలే ఉపాయం – అనే ఉపాయ స్వరూపం, ఆ స్వామికి నిత్యసేవను చేయడమే పరమ ప్రయోజనం – అనే ఫలస్వరూపం, ఆ స్వామికి దూరమై ఈ సంసారంలో బంధింపబడడం– అనే విరోధిస్వరూపం అనే అయిదు అర్థతః తెలియజేయబడినందున, ఇది ఈ ప్రబంధానికి సంగ్రహ రూపం, మిగిలిన ప్రబంధం అంతా కూడా దీని వివరణాత్మకమే – అని వ్యాఖ్యాతలు వివరించారు. ఇటువంటి క్రమాన్నే శారీరక మీమాంసలో కూడా చూడవచ్చు. ఆ శాస్త్రంలో ఉండే మొదటి నాలుగు సూత్రాలు ఆ శాస్త్రానికి సంగ్రహమని, వాటి వివరణమే మిగిలిన శారీరకశాస్త్రం అంతా కూడా అని ఆచార్యులు అభిప్రాయపడ్డారు.

ఈ ప్రబంధంలో ఉండే విశేషాలను సమగ్రంగా ప్రస్తావించడం అనేది, ఈ వ్యాస పరిమితినిబట్టి, సాధ్యం కాదనే అభిప్రాయంతో ఈ ప్రబంధ వైభవ ప్రస్తావన ఇంతటితో ముగించబడుతున్నది.

**"వేదమ్ తమి(ழ்) శెయ్ ద మాఱన్"** (వేదాలను ద్రావిడీకరించిన మాఱన్) అని కీర్తింపబడే నమ్మాళ్వారులను, చతుర్వేదాలకు సారరూపాలుగా అవతరించిన వారి నాలుగు దివ్య ప్రబంధాలను గూర్చి సాకల్యంగా తెలియజేయడం అసాధ్యమైన పని. వీటిని గూర్చి యథావకాశంగా, యథామతి ఈ వ్యాసంలో కొన్ని అంశాలను మాత్రమే ప్రస్తావించడం జరిగింది.

ఈ ఏడు, నవంబర్ మాసంలో ముదల్ ఆళ్వారుల అవతార దినోత్సవాల సందర్భంగా, ఖమ్మం నగరంలో ద్వాదశ దివ్యసూరులను గూర్చిమూడు నాళ్ళు గొప్ప సాహిత్య సదస్సును ఏర్పాటు చేసి, అందులో అన్వయించే గొప్ప అవకాశాన్ని నాకు ఇవ్వడమే కాక, నమ్మాళ్వారులకు, వారి ప్రబంధాలకు సంబంధించిన ఒక వ్యాసాన్ని విన్నపించవలసినదిగా కూడా ఒక మంచి అవకాశాన్ని నాకు అందించిన సహృదయులు, వేదపాంచరాత్రాగమాదినైకవిద్వాంసులు, లబ్ధప్రతిష్ఠులు, విశేషించి, నా పట్ల విశేషమైన ప్రీతిని కలవారైన ఉ. వే. శ్రీమాన్ కె. కోదండరామాచార్యస్వామివారికి, ఈ ప్రయత్నంలో వారికి సహకరించే పెద్దలు అందరికీ నేను హార్దంగా అనేక కృతజ్ఞతలను ఆవిష్కరించుకుంటున్నాను.

దివ్యసూరులు లోకానికి అందించిన అపూర్వాలైన దివ్య ప్రబంధాలలో ఉండే సాహిత్య సౌందర్యాలను, దార్శనిక తత్వాలను నలుగురకు అందజేయాలని చేసే ఈ ఉదారమైన ప్రయత్నం చాలా ప్రశంసించదగినది. ఈ సదస్సులో పాలు పంచుకోవడం నా అదృష్ట విశేషంగా భావిస్తున్నాను. స్వస్తి.

**వేదార్థా నతిదుర్గహాన్ కరుణయా సద్ద్రావిడీభాషయా**

రస్యగ్రంథచతుష్టయప్రణయనం కృత్వా ఽ నుజగ్రాహ యః,
తస్య శ్రీశఠవైరిణః సుమహితశ్రీపాదయుగ్మాలయే
పౌనఃపున్యకృతజ్ఞతాం పరమయా భక్త్యా ఽ ర్పయామో నతాః.

గోసహస్రేణ గాఢాంధతమోవారణదక్షిణః,
జయతాత్ శఠజిత్సూరిః జయతాత్ జయతాత్సదా.

